Photo by Pranlal K. Patel




బహుమతి పొందిన వ్యాఖ్య

'రెస్టు'

పంపినవారు :
బి. పి. విఠల్‌కుమార్ - వాల్తేరు

## ఈ సంచికలో కథలు వింతలు - విశేషాలు







ఇవన్నీగాక బదులుచెప్పు - తొమ్మిది మాహాత్మ్యం - రైపుచిత్రాలు - ఒంటిగీత బొమ్మ - ఫోటోశీర్షిక వ్యాఖ్యలపోటీ మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు

# ఆరోగ్యప్రదాయిని




జీవామృతము వాడుటవలన బలహీనదేహములకు బలమును, దుర్బల వీర్యులకు పటుత్వమును, నిద్రాహీనులకు సుఖ నిద్రయు, నరముల ప్రోగుకు కండపుష్టియు, మందకొడిగనుండువారికి ఉల్లాసమును, జ్ఞాపకహీనులకు జ్ఞాపకశక్తియు, రక్తహీనులకు క్రొత్త రక్తమును, జీర్ణశక్తిలేనివారికి జఠరదీప్తియు, పాలిపోయినవారికి తేజస్సును, మొదలగు అసంఖ్యాకములైన సుగుణములు యెన్నియో గలుగును. స్త్రీ-పురుషులెల్లరు వయోభేదములేక ఎల్లకాలములయందు సేవింప దగిన దివ్యమైన టానిక్.

## జీవామృతం

కండపుష్టికి, జవసత్వములకు.

**ఆయుర్వేదాశ్రమం లిమిటెడ్,**

మదరాసు - 17.



బంగారు, వెండి నగలు చేయు అన్నిరకముల పనిముట్లు దొరుకును.

## పి. శేషాచలం & బ్రదర్సు

26. నేతాజీసుభాసు రోడ్డు, మద్రాసు-1

## తమిళంలో కూడా

## "కినిమా"

జులై నుండి వెలువడుతుంది

| విడిప్రతి : | | సాలుచందా : |
| --- | --- | --- |
| **0-8-0** | ★ | **6-0-0** |

——— వివరాలకు : ———

## చందమామ పబ్లికేషన్సు

వడపళని :: మద్రాసు - 26.

## చందాదారులకు మనవి



పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోష్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోష్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లైంట్లు గతనెలలో చేరలేదనే కంప్లైంట్లు గమనించబడవు

మేనేజరు

PHONE: 31 GRAMS: PUBLISHERS

మీడియమ్ డిక్షనరీ

# Balasaraswathi Pictorial Medium Dictionary

**ENGLISH - ENGLISH : TELUGU WITH**

English Synonyms, Antonyms, Definitions and Illustrations

TOGETHER WITH

An Encyclopedia for Students




విద్యార్థులారా :

మా డిక్షనరీ విద్యార్థులకు-విజ్ఞానవేత్తలకు నిత్యం వారు చేసే విద్యా వ్యాసంగంలో ఎంతో ఉపయోగపడుతోంది. వేనకువేలు దీనివల్ల నేడు లాభపడుతున్నారు. విజ్ఞానం కావాలని, ఆంగ్లభాషలో పరిశ్రమ చేయాలని అనుకొనేవారందరికి చేదోడు వాదోడుగా వుండి, మీకా భాషలో శక్తిసామర్థ్యాలు తక్కువగావున్న లోపాన్ని తీర్చగలదు. ఇందులో మీకు అవసరమైనట్టి పదాలన్నింటిని కూర్చి సరిక్రొత్త పద్ధతిలో (English to English and Telugu and English synonyms, Anthonyms, Definitions and Illustrations together with an Encyclopedia for students) చేర్చి అందము చందము లొలికేట్లుగా ముద్రించినాము. విద్యకు - విజ్ఞానానికి పరీక్షలో విజయానికి మీకు ఈ డిక్షనరీ ఎంతైనా తోడ్పడగలదని హామీ యిస్తున్నాము. పూర్తి క్యాలికోబైండు మీడియం డిక్షనరీ ధర రు. 9-0-0. జెం డిక్షనరీ ధర రు. 4-8-0. తక్కువ వెల : ఎక్కువ విలువ :: అవకాశాన్ని జారవిడుచుకోకుండా జాగ్రత్తపడాలని మిమ్మల్ని ప్రత్యేకంగా కోరుతున్నాము.

హిగ్గిన్‌బాథమ్స్ బుక్‌స్టాలులలో దొరుకును.

బాలసరస్వతీ బుక్ డిపో, పోస్టు బాక్సు నెం. 3 కర్నూలు & మద్రాసు 1.

---

పాఠకులకు శుభవార్త!

'చందమామ' లో సీరియల్‌గా ప్రచురించిన అత్యుత్తమ కథ

## "ఐదు ప్రశ్నలు"

పుస్తకరూపంగా వెలువడుతుంది

ముచ్చటైన ముద్రణ, ఆకర్షణీయమైన ముఖచిత్రం

48 పేజీలు :: వెల 6 అణాలు.

కావలసిన ప్రతులకు ఏజంట్లు మామూలు కమీషన్ మినహాయించుకుని పైకం పంపాలి. విడిగా కావలసినవారు ఎనిమిదణాలు మనియార్డరుగానీ పోస్టల్ ఆర్డరుగానీ పంపవచ్చును.

పుస్తక విక్రేతలకు మంచి కమీషన్

వివరాలకు వెంటనే వ్రాయండి :

## చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మదరాసు - 26.

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

గత సంచికలో ప్రారంభించిన టైప్‌రైటింగ్ చిత్రంచూచి, అన్ని ప్రాంతాలనుండీ పాఠకులు కృషిచేసి చక్కటి చిత్రాలు పంపుతున్నారు. ఇది సంతోషదాయకమైన విషయం. రెండు కారణాల వల్ల ఈ నెలనుండి 'ఫొటోశీర్షిక పోటీ'కి 'కూపన్' పద్ధతి నిలిపివేయవలసి వచ్చింది. మొదటిది: 'అందమైన చందమామ సంచికను చించటానికి మాకు మనస్కరించటంలేదు' అని పాఠకులు చిర కాలంనుండి వ్రాస్తున్నారు. రెండవ కారణం: మూడు కానులకు బదులు రెండేసి అణాలు కవర్ల కోసం వెచ్చించి, చాలామంది అనవసరమైన కర్చుకు పాల్పడుతున్నారు. ఈ కారణాలవల్ల, ఇటుపైనుండి శీర్షికలు పంపటానికి మామూలు పోస్టుకార్డులనే ఉపయోగించవలసినదిగా కోరివున్నాము.

సంపుటి 13 : జూలై 1953 : సంచిక 1

# నమ్మిక గల బానిస

అనగనగా ఒక నవాబువద్దను
ఉండె వాడొక నీగ్రో బానిస.
నీడలాగ అతడు తన ప్రభువుకు
ప్రక్కన ఉండేవాడు అహర్నిశ.
ఒకరోజున అడిగారు నవాబును
ఎవరో 'అతడంటే మీకెందుకు
అంత ఇష్ట'మని. చెప్పాడప్పుడు
చిన్న కథొక్కటి నవాబు వారికి:





'నేనొక రోజున నా బలగంతో
బాటన పోతున్నా. ఒకచోటున
పడినది నేలను ముక్తాపేటిక,
నిలచా రందరు తత్తరపాటున.

ముత్యాలన్నీ చెదరి రాలినవి
ధూళిని దూరంగా ; నే నన్నా—
'ఎవ్వరేరుకున్నవి వారివి ఇక
పడి ఏరుకోవచ్చు ఎవరన్నా.'

ఈ పలుకులు విన్నంతట ఎక్కడి
వారక్కడనే పరుగెత్తారు.
ఒక్కరు మిగలలేదు నాప్రక్కన.
ఆశలేని వారెవరుంటారు ?





రచన:
బైరాగి

సేవకులది ఏముంది, ధనంతో
కొనవచ్చును మరి ఎందరినైనా.
నిష్కల్మష హృదయాల భక్తిమటు
కెవరూ కొనలే రావంతైనా."

అని సవాబు చెప్పిన కథ వినగా
కలిగిం దాశ్చర్యం అందరికీ.
అతడు నల్లగా మురికై ఉన్నా
మక్కువగానే ఉందందరికీ.

ఈ బానిసమాత్రం శిలలాగా
కదలలేదు నా సన్నిధినుంచి.
నే నన్నా—'ఏంకావాలోయీ
నీ కింకా, ముత్యాలను మించి.'

అతడన్నాడు—'నాకు ఓ దేవా;
మీ నమ్మికకన్నా వేరొద్దు.
ప్రభువిచ్చిన కానుకల మోజులో
ప్రభువును మరచిపోవటం కద్దు.'

అతడిచ్చిన జవాబు విని మనసున
నాకు కలిగినది ఎంతో మోదం.
ఇట్టి సేవకులు కలిగిన ప్రభువుకు
రాదెన్నడునూ ఎట్టి ప్రమాదం.







# కోటలో కుక్కలు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలన చేసే కాలంలో ఒకప్పుడు బోధిసత్వుడు రుద్రభూమిలో శునకంగా జన్మించి, వందలకొలది కుక్కలు గల ఒక పెద్ద మందకు పెద్దగా ఉంటూవచ్చాడు.

ఒకరోజున రాజు, మేలుజాతి తెల్లటి గుర్రాలను పూన్చిన తన అందాలగుర్రపు సారటు మీద విహారంకోసమని వెళ్ళి, సూర్యాస్తమయం అయేసరికల్లా మళ్ళీ కోటకు చేరుకొన్నాడు.

చేరుకొన్నతరువాత, గుర్రపుసారటును పెరట్లో విప్పి వదిలేశారు పరిచారకులు. ఆ రాత్రి పెద్ద వర్షంకురిసి, సారటు పూర్తిగా తడిసిపోయింది. పైగా, రాజుగారి కుక్కలు మేడదిగివచ్చి, సారటుకు ఉండే తోలు సామగ్రి నంతటినీ కొరికి ముక్కలుచేసినై.

మరునాడు పరిచారకులు రాజువద్దకు పోయి, "ప్రభూ!—కుక్కలు వచ్చి మన సారటు బండి సామగ్రినంతటినీ కొరికి పోగులుపెట్టినై" అని ఫిర్యాదు చేశారు.

ఈ మాట వినటంతోనే రాజుకు కుక్కల మీద కోపంవచ్చింది. "వెధవ కుక్కలు, కంటబడిన కుక్కనల్లా పట్టి చంపేయండి" అని అజ్ఞయిచ్చాడు.

రాజు ఇలా అజ్ఞ ఇవ్వగానే రాజ్యంలో కుక్కలవధ ప్రారంభమయింది. కంట బడిన కుక్కనల్లా రాజుగారి తలారివాళ్ళు పట్టి చంపుతూవచ్చారు.

ఈ గొడవ ఎక్కువకాగానే, రాజ్యంలో కుక్కలన్నీ కలిసి బోధిసత్వుడు వుండే రుద్రభూమికి వెళ్ళినై.

"ఏమిటి? మీరందరూ ఎందుకిలా పరుగెత్తుకువచ్చారు?" అని అడిగాడు బోధిసత్వుడు ఆత్రంగా.

"ఏలికా! ఇంకేముంది? మనజాతిని నాశనంచేసే ముసలం పుట్టిందిప్పుడు.

ఆదినారాయణ

రాజుగారి గుర్రపుసారటు మీది తోలు ముక్కలను ఏవో కుక్కలు కొరికివేశాయట. ఈ మాట తెలియగానే ప్రభువులు మండి పడి, కుక్కజాతినే కంటపడకుండా నిర్మూలం చేయమని ఆజ్ఞ యిచ్చారట!" అని విన్నవించుకున్నాయి, ఆ కుక్కలు.

అప్పుడు బోధిసత్వుడు ఇలా తలిచాడు: "బయటనుండే కుక్కలు కోటలోపలికి వెళ్లటానికి ఎంతమాత్రమూ సాధ్యపడదు. ఏమీ అంటే—అహోరాత్రాలు పారావాళ్లు కాపలాకాస్తునేవుంటారు. కనుక, యిది కోటలో వుండే కుక్కలు చేసిన పనేకాని, వేరేమీకాదు. ఈ మాట నిజం. పోతే—నేరంచేసిన కుక్కలు బాగానే వున్నాయి; ఏపాపం యెరుగని నా కుక్కలు నిష్కారణంగా బలి కావలసివచ్చింది. ఇలా ఊరుకుంటే ఎలాగ? నేరంచేసిన కుక్కలు ఏవో కనుక్కొని, రాజుకు పట్టి యిచ్చి, నా కుక్కలను నేను రక్షించుకోవటం పాడికదా!"

ఇలా తలిచి బోధిసత్వుడు తన కుక్కలతో "మీరేమీ భయపడకండి. మిమ్మల్ని రక్షించే భారం నాది. నేను రాజుపద్దకు పోయివస్తా. నేను వచ్చేవరకు




మీరిక్కడనే వుండండి!' అని చెప్పి సముదాయించాడు.

సముదాయించి బోధిసత్వుడు, తన మనసులో "ధర్మం జయించుగాక! రాజు న్యాయం పాలించుగాక!" అని అనుకొంటూ, బయల్దేరాడు. అలా కోటకు వెళుతున్న ఆ కుక్కను చూచి రాజభటు లెవ్వరూ ఒక్క రాయి ఐనా దానిమీద విసరలేదు. కోపగించుకోనూలేదు.

అక్కడ—

కంటబడిన కుక్కలన్నిటిని చంపమని ఆజ్ఞ ఇస్తూనే, రాజు వచ్చి దర్బారులో



న్యాయస్థానమందు ఆసీనుడయ్యాడు. అప్పుడు బోధిసత్వుడు అనే శునకం సింహాసనంకిందినించి దూరివచ్చి, రాజు ఎదుట నిలబడింది. రాజుగారి పరివారం ఆ కుక్కను పట్టబోయారు. కాని, పట్టవద్దు అని రాజు వారిని ఆటంకపరిచాడు.

బోధిసత్వుడు రాజుకు వినయంగా నమస్కరించి, "ప్రభూ!—కుక్కలన్నిటినీ చంపివేయమని ఆజ్ఞాపించింది తామేనా?" అని అడిగాడు.

"అవును" అన్నాడు రాజు.

"అవి చేసిన తప్పేమిటి, రాజా?" అని మళ్ళీ అడిగాడు బోధిసత్వుడు. "మా ఆస్థానపు సారటుకు గల సామగ్రిని కొరికివేసినై" అని చెప్పాడు రాజు.

"సరే, ఆ కొరికిన కుక్కలేవో తమకు ఆనవాలు తెలుసా?" అని ప్రశ్నించాడు బోధిసత్వుడు.

"తెలియదు" అన్నాడు రాజు.

"మరి, నేరంచేసిన కుక్కలేవో తెలుసుకోకుండా, కంటబడిన కుక్కలన్నిటినీ చంపివేయమనటం న్యాయమేనా! నిరపరాధులను నిష్కారణంగా చంపటమేనా ధర్మం?" అని అడిగాడు బోధిసత్వుడు.

"మా సారటుసామగ్రి పాడుచేయటంచేతనే కుక్కజాతిని నాశనం చేసివేయమన్నాము" అని చెప్పాడు, రాజు.

"ఐతే మీ పరిచారకులు కుక్కలన్నిటినీ చంపుతారా, కొన్నిటిని వదలిపెడతారా?" అని మళ్ళీ ప్రశ్నించాడు బోధిసత్వుడు.

"అన్నిటినీ చంపరు. మా కోటలో వుండే ఉత్తమజాతి శునకాలను తాకరు" అని చెప్పాడు రాజు.

అప్పుడు బోధిసత్వుడు ఇలా అన్నాడు: "ప్రభూ!—ఇప్పుడేకదా తమరు 'మా సారటు సామగ్రి కొరికివేయటంచేత కంట



బడిన కుక్కనల్లా చంపివేసి కుక్కజాతినే నాశనం చేయవలసిందని ఆజ్ఞాపించాము' అని సెలవిచ్చారు? మళ్ళీ తమరే సెల విస్తున్నారేమిటి—"మా కోటలో కుక్కలను మాత్రం తప్పించి" అని?—దీన్నిబట్టి చూడగా దేవరవారికి పక్షపాతం, ద్వేషం, అవివేకం, భయం అనే నాలుగు అవ గుణాలు పట్టినట్టుగా కనబడుతున్నది. ఇవి ఎంతమాత్రమూ రాజలక్షణాలు కావు. న్యాయవిచారణ చేసే ప్రభువులు నిష్పాక్షికంగా వుండాలి. కాని, ఇప్పుడు తమ ఆజ్ఞ వల్ల కోటలో కుక్కలుమట్టుకు సురక్షితంగా వుండటం, ఏ పాపమూ ఎరుగని ఊరి కుక్క లన్నీ నిష్కారణంగా బలికావటం జరుగు తున్నది. న్యాయం ఎంతమాత్రమూ పాలింపబడటంలేదు. అదుగో "ప్రభువు న్యాయం పాలించటంలేదు" అని ఆకాశ వాణికూడా పలుకుతున్నది, విను రాజా:—

"కోట కుక్కలూ కూటికి లేక
కళవెళపడుతుంటే
దోషమెరుగని ఊరికుక్కలూ
బలి ఐపోతున్నయ్!"
రాజా!—ఇదా నీ న్యాయం?
ప్రభూ!—ఇదా నీ ధర్మం?—"




ఈ మాటలు వినేసరికి రాజు హృద యంలో గొప్ప మార్పు వచ్చింది. "మరైతే, మా సారటు సామగ్రి పాడుచేసిన కుక్కలు ఏవో నీ బుద్ధిబలం ఉపయోగించి చెప్ప గలవా?" అని అడిగాడు.

అందుకు బోధిసత్వుడు "చెప్పలేకేం?" అంటూ "మనకోటలో వుంటున్న మేలు జాతికుక్కలే!" అని చెప్పాడు బోధిసత్వుడు.

"అదేంమాట?" అన్నాడు, చీకాకుతో రాజు.

"కావలిస్తే ఋజువుచేయగల ప్రభూ!" అన్నాడు ఆందుకు.



"ఏదీ, చెయ్యి చూతాం" అన్నాడు రాజు.

కొంచెం మజ్జిగ, గరికపోచలూ తెప్పించి కోటలోని కుక్కలను రప్పించమన్నాడు బోధిసత్వుడు. ఆయన సలహాప్రకారం మజ్జిగలో గరికపోచలు ముక్కలుచేసి పడవేసి, ఆ కుక్కలకు పట్టించారు.

వెంటనే ఒక్కొక్క కుక్క వాంతిచేసుకోటానికి ప్రారంభించింది. అవి మింగిన తోలుముక్కలన్నీ ఒక్కటీ మిగలకుండా బయటబడనై. "రాజా! —తెలిసిందా యిప్పుడు? నీ పనివాళ్ళు మీ కుక్కలకు ఆహారం సరిగా పెట్టకపోవటంచేత, కడుపు మాడి అవి తోళ్ళు కొరుక్కు తినవలసి వచ్చింది" అని చెప్పాడు బోధిసత్వుడు.

రాజు పరమానందభరితుడై, ఈయన శునకరూపంలో వున్న బోధిసత్వుడు తప్ప వేరెవ్వరూ కాదు," అని నిశ్చయించి, తన ఛత్రం బోధిసత్వునికి పట్టించాడు. అప్పుడు బోధిసత్వుడు "రాజా!— న్యాయపరిపాలన చేయటమే రాజలక్షణం" అని చెబుతూ, ఇంకా అనేక రాజధర్మాలు ఉపదేశించాడు.

ఈ బోధలు విన్నతరువాత రాజు, ప్రతి జీవినీ దయగా చూడవలసిందని పరివారానికి చెప్పాడు.

ఆనాటినుంచీ, కోటలో ఉండే కుక్కలకే కాక, రాజ్యంలోని కుక్కలన్నిటికీ రోజు ముప్పొద్దులా తగిన ఆహారం పెడుతూ, కావలసిన సదుపాయాలన్నీ అమర్చమని ఆజ్ఞాపించాడు.

కుక్కల విషయంలోనే కాదు. బోధిసత్వుని బోధలు ఎల్లప్పుడు వింటూ, రాజు తన జీవితంలో అనేకమైన మంచికార్యాలు చేసి, కైవల్యంపొందాడు.

ఈవిధంగా శునకరూపంలో బోధిసత్వుడు పదివేల సంవత్సరాలపాటు లోకానికి ఉపదేశాలుచేసి, ఎంతోమందికి తరణోపాయం చూపించి ధన్యుడయ్యాడు.






లేఖతో సహా భీమవర్మవద్దకు వెళ్లిన విజయవర్మ తిరిగివస్తూ, త్రోవలో పురుషరూపంలో పారిపోతున్న కరుణను కలుసుకొన్నాడు. యుద్ధంలో భీమవర్మ పక్షం ఓడిపోయింది. భీమవర్మ మారు వేషంతో ప్రాణాలు దక్కించుకొని పారిపోయాడు. అక్కడ శత్రువులు పెచ్చరిల్లుతారు. భీమవర్మ ఆజ్ఞప్రకారం విజయవర్మ కరుణను గిరికోట చేరుస్తాడు. ఇక—

గిరికోట తిరిగివెళ్లిన విజయవర్మకు అక్కడి జనమంతా చాలా నిస్పృహగా కనిపించారు. యుద్ధంలో ఓడిపోవటం, పైపెచ్చు శబ్దవేధి దుండగాలూ! కోటలో ప్రవేశించిన కరుణాకరుడు మరి కనబడలేదు. తన తండ్రి చావునుగురించి అతను అన్న మాటలు విజయవర్మ మనసులో మెదులుతూనే ఉన్నాయి. ఏమీ తోచక అతను రాంసింగును అడిగాడు. రాంసింగు ఒక్క క్షణం అతనివంక తీవ్రంగా చూచి—'నాకీ విషయాలు తెలియవు. నీవూ ఇలాంటి విషయాలు పట్టించుకొనకపోవటమే మంచిది. కాదంటావా సోమశర్మగారిని అడుగు' అన్నాడు. మారుమాటాడకుండా విజయవర్మ వెళ్లిపోయాడు.

భీమవర్మ తన సైనికులకు ధైర్యంచెప్పి బీసల్పూరు సామంతులలో ఒకడైన దేవదుర్గాధిపతికి ఒకలేఖ పంపించాడు. అతడీ విధంగా రంగుమార్చటం ఎవరికీ ఆశ్చర్యం కొలపలేదు. అతని కది అలవాటే.

విజయవర్మ తిన్నగా సోమశర్మగారి వద్దకు వెళ్లి రాంసింగును అడిగిన ప్రశ్న మళ్ళీ అడిగాడు. సోమశర్మ 'ఇదివరకొక సారి చెప్పలేదా' అనేసి వెళ్ళిపోయాడు.




విజయవర్మకు తృప్తి కలగలేదు. 'ఈ విషయం ఇంకెవ్వరిని అడుగుదామా' అనుకొనేటంతలో భీమవర్మగారు పిలుస్తున్నారని చెప్పాడు ఒక సేవకుడు.

విజయవర్మ వెళ్ళేటప్పటికి భీమవర్మ తన గదిలో కోపంగా పచారుచేస్తున్నాడు. పక్కన సోమశర్మ తప్ప మరెవ్వరూ లేరు. వెంటనే విజయవర్మ తనకు పిలుపు ఎందుకు వచ్చిందో గ్రహించగలిగాడు. 'నన్ను పిలిచారా?' అన్నాడు మెల్లగా.

"ఔను, కనపడ్డవారినందరినీ నీవు యేవేవో ప్రశ్నలు వేస్తున్నావటగదా? నిన్ను పెంచి పెద్దవాణ్ణి చేసినందుకు ఇదేనా ప్రతిఫలం? నీకేం లోటు చేశాను? కన్నకొడుకు కంటే ఎక్కువగా చూసుకొంటున్నానే!" అని కస్సుమంటూ లేచాడు భీమవర్మ.

"ఇవన్నీ మర్చిపోయేటంత కృతఘ్నుణ్ణి కాను నేను. కాని నా తండ్రిచావుగురించి రకరకాల గాలికబురులు వినవస్తున్నయ్. సత్యమేమిటో తెలుసుకొనేవరకు నాకు స్థిమితం చిక్కదు" అని విజయవర్మ గట్టిగా సమాధాన మిచ్చాడు.

'అయితే విను: భగవంతుని సాక్షిగా చెబుతున్నాను. మీ తండ్రిచావుతో నాకెట్టి ప్రమేయం లేదు. నా మాట నమ్మకముంటే అనుమానం రద్దుచేసుకో. లేదా, కోటబయట అరణ్యంలో నా శత్రువులెంతమందో ఉన్నారు. నీవుకూడా వారిలో కలిసిపో' అని భీమవర్మ ఒట్టువేసుకునేసరికి విజయవర్మకు పూర్తిగా సంతృప్తి కలిగింది. అతను సంతోషంగా సోమశర్మవైపు తిరిగాడు.

కాని, సోమశర్మముఖం చూచి అతనికి అంతులేని ఆశ్చర్యం కలిగింది. అతని ముఖంమీద కత్తివాటుకు నెత్తురుచుక్కలేదు. భయంతో నిలువునా వణికిపోతున్నాడు. విజయవర్మ మళ్ళీ అనుమానంతో 'సోమశర్మగారుకూడా ఒట్టువేసుకుంటే!' అన్నాడు.




"ఎందుకు వేసుకోడు ? నేరం చెయ్యని వాడికేం భయం ? వేసుకోవయ్యా ఒట్టు!' అన్నాడు భీమవర్మ. కాని సోమశర్మ నోటివెంట మాట రాలేదు. భీతితో అతడు భీమవర్మవైపే చూస్తున్నాడు.

ఇంతలో ఆ గదికిటికీలోంచి ఒక బాణం రివ్వుమంటూ వచ్చి, ఆ ముగ్గురి కెదురుగా వున్న గోడలో గ్రుచ్చుకొని జవజవలాడింది. అది శబ్దవేధిబాణమని ఆ ముగ్గురూ చూడ గానే తెలుసుకున్నారు. సోమశర్మ ఒక పిచ్చికేకవేసి వెనక్కు పడిపోయాడు. భీమ వర్మ, విజయవర్మలు పరుగెత్తుకొని కిటికీ వద్దకువెళ్లి తొంగిచూశారు. కాని ఏవిధమైన అలజడీ కనుపించలేదు. దూరంగా చెట్లమీద పక్షులు ప్రశాంతంగా ఎగురు తున్నవి.

భవనద్వారంవద్ద యథావిధిగా కాపలా కాస్తూనే ఉన్నారు. 'సరే, విజయా! ఇక నీవు వెళ్ళు. సోమశర్మ ఒట్టువేసుకోక ఎక్కడకు పోతాడో చూస్తాను. నీవూ కొంచెం కనిపెట్టి ఉండు, ఎందుకైనా మంచిది' అని భీమ వర్మ విజయుణ్ణి పంపివేశాడు.

అప్పుడే తేరుకొంటున్న సోమశర్మ వైపు తిరిగాడు. 'నీమూలాన అతనికి మళ్ళీ అనుమానంవేసింది. ఈరాత్రికి నీవు కూడా ఒట్టుపెట్టుకొంటే అతని ప్రాణాలు రక్షించినవాడివౌతావు. లేదా, అతడుకూడా తన తండ్రితోనే పట్టపలసివస్తుంది. ఇదిగో, వెంటనే అతణ్ణి పడమటి గదిలోకి మార్చు'.

'పడమటిగదిలోకా?' అన్నాడు సోమ శర్మ బొంగురుగొంతుకతో.

"ఔను, అతని చావుబ్రతుకులు నీ చేతుల్లో వున్నాయి. ఒట్టుపెట్టుకొని యేదో విధంగా మెదుపుచ్చావా, అతను బ్రతికి పోతాడు. లేదా, తండ్రితోపాటు కొడుకును చంపిన పాపంకూడా నీ తలకు చుట్టు కుంటుంది. ఏమంటావు?" అన్నాడు భీమ వర్మ. క్షణమాత్రం ఉండి సోమశర్మ




'లేదండి. అతని ప్రాణాలు రక్షించటానికి బొంకనైనాబొంకుతాను' అన్నాడు. 'ప్రక్క గదిలోనే ఉంటా. అతని అనుమానం నిర్మూలం చెయ్యి' అని భీమవర్మ వెళ్లిపోయాడు.

మరికొంతసేపటికి విజయవర్మ ఆ గదిలో ప్రవేశించాడు. పాపం సోమశర్మ ముఖం పాలిపోయివుంది. తలెత్తిచూసి విజయవర్మ చేయిపట్టుకొని 'నేనుకూడా ఒట్టు పెట్టుకొంటే నీకు సంతృప్తి కలుగుతుందిగా? భగవంతుని సాక్షిగా చెబుతున్నాను. నీ తండ్రిచావుతో నాకెట్టి ప్రమేయం లేదు' అని నిష్కర్షగా చెప్పాడు.

అప్పుడు విజయవర్మ 'సరే. మరి ప్రమేయ మెవరికుందో మీకు తెలుసా?' అని అడిగాడు. సోమశర్మ తొట్రుపడి 'లేదు, లేదు. నాకేమీ తెలియదు' అంటూ వెళ్ళిపోయాడు.

నిర్దోషినని ఒట్టుపెట్టుకొన్న సోమశర్మ ఇలా తత్తరబోయి హఠాత్తుగా వెళ్ళిపోవటం విజయవర్మకు ఆశ్చర్యం కలిగించింది. నలువైపులా కలియజూచాడు. ఎదురుగా వున్న గది కిటికీలు కదిలినట్టనిపించింది. ఎవరిదో ఒక కన్ను క్షణమాత్రం తళుక్కుమని తొలగిపోయింది.

జరిగిన సంభాషణ అంతా ఎవరో పొంచి విన్నారన్నసంగతి విజయవర్మకు రూఢి అయింది. ఇదంతా ఒక మాయనాటకమన్న సంగతి తెలిసిపోయింది. 'నేను పాలీని వలలో చిక్కుకొన్నాను' అనుకొన్నాడు. వెంటనే కరుణాకరుడు స్ఫురణకు వచ్చాడు. 'పాపం, నామూలాన అతడు కూడా వలలో చిక్కుకొన్నాడే' అని విచారించాడు.

విజయవర్మ గదిలోనించి బయటకు రాగానే ఒక దూత వచ్చి అతని ఉనికి మరో క్రొత్తగదిలోకి మార్చబడింది అని చెప్పాడు. 'ఎందువల్ల? ఏగది?' అని అడిగాడు

విజయవర్మ. 'పడమటిగదిలోకి' అనిబదులు చెప్పాడు దూత. 'ఎలాంటి గది ? బాగుం టుందా ?' అన్నాడు విజయవర్మ. 'గదికేం, భేషుగ్గానే వుంటుంది, దెయ్యాలున్నయ్యన్న మాటకాని' అన్నాడు దూత. శంకాకుల చిత్తంతో విజయవర్మ తన క్రొత్త నివాసం వైపు తరలాడు.

ఆ గదిఎత్తు తక్కువగా, విశాలంగా, చీకటిగా ఉంది. దానిలో పందిరిమంచం మహారాజులు పడుకొని నిద్రించేదానిలాగా ఉంది. ఒకప్పుడు ఎవరో గొప్పవారున్న గది. ఇది అంతా చూడగా విజయవర్మ అను మానం ఇంకా ఎక్కువయింది. అతడు గోడలు, అలమారులు అన్నీ తట్టి, పరీక్షించి చూచాడు. కాని ఎక్కడా విశేషమేమీ గోచరించలేదు. అయితే గుప్తద్వారం ఎక్కడ? ఎక్కడో ఒకచోట ఉండితీరాలే ?

రానురాను అనుమానాలింకా ఎక్కు వయాయి. ఇటువంటిచోట కన్నుమూయడం ప్రమాదమనుకున్నాడు.

ఇంతలో అతనికి గదితలుపులెవరో గోకు తున్నట్టు విన్పించింది, దగ్గరకు వెళ్ళి చెవి ఒగ్గి విన్నాడు. ఎవరో మెల్లగా తలుపు తీయమంటున్నారు. కంఠం గుర్తుపట్టి విజయవర్మ వెంటనే తలుపుతీశాడు. ఒక




చేతిలో చురకత్తి పట్టుకొని కరుణాకరుడు లోన ప్రవేశించాడు.'ఏం' జరిగింది ? కోటలో ప్రవేశించాక మళ్ళీ కనిపించలేదేం?' అని ఆత్రంగా ప్రశ్నలువేశాడు విజయవర్మ.

"ఏంజరిగితేనేం, మనం మళ్ళీ ఇక్కడ కలుసుకున్నాం. నీవు మట్టుకు త్వరగా పారిపో. తెల్లవారితే ప్రాణాలు దక్కవు. వాళ్లు గుసగుసలాడుకోవటం నేను చెవు లార విన్నాను" అన్నాడు కరుణాకరుడు. తరువాత వారిద్దరూ కలసి గుప్తద్వారం కోసం మళ్ళీ వెతకటం ప్రారంభించారు. ఇంతలో గదిబయట అడుగుల చప్పుడు విని పించింది.



'కరుణ ఎవరబ్బా! కరుణాకరా! పొరపాటున నిన్ను ఆడపిల్ల వనుకోవటం లేదుగదా వాళ్ళందరూ!' అన్నాడు విజయవర్మ.

"మొదటికే ముప్పు వచ్చిందిప్పుడు. నన్ను పట్టుకున్నదాకా ఊరుకోరు వాళ్ళు. తలుపు తెరచి నన్ను పోనివ్వు విజయా! వాళ్లు నన్ను పట్టుకొని సంబరపడుతుంటే నీవు తప్పించుకు పోవచ్చు" అని సలహా చెప్పాడు కరుణాకరుడు.

అప్పుడు అర్థమయింది విజయవర్మకు. పరిస్థితి అంతా.

"నీవు కరుణాకరుడివి కాదు. నీవే కరుణవు" అని అరిచాడు. కరుణ మారు మాటాడకుండా నిలుచుంది.

'కరుణా! మించిపోయిందిలేదు. బ్రతికి బాగుంటే మనిద్దరికిక ఎడబాటు ఉండదు. చావే తప్పకపోతే ఇద్దరం ఒకేసారి చద్దాం' అన్నాడు విజయుడు.

కాని అంతలో అతని మాటలు కాదన టానికే అన్నట్టుగా బయట అడుగుల సందడి వినిపించింది. అంతేకాదు, ఎవరో బలంగా తలుపు గ్రుద్దిన ధ్వని అయింది. పైగా మరునిముసంలోనే భీమవర్మ కంఠం వినిపించింది. 'తలుపు తెరువు విజయా!

దీపం ఆర్పేసి వారిద్దరూ చీకటిలో దాక్కొనికూచున్నారు. గదికొకమూల వారు గోడ అనుకొన్నచోట చెక్కలు తొలగి కొంచెం వెలుతురు లోనికి చొరబడింది. విజయుడూ కరుణాకరుడూ ఊపిరి బిగపట్టుకుని యిది చూస్తూనేవున్నారు.

ఇంతలో భవనం వెలుపల కేకలూ, అరుపులూ వినిపించాయి. తక్షణమే గుప్త ద్వారం మూసుకుంది. 'హంతకుడు' ఇది అదను కాదని వెళ్లిపోయాడు.

బయట అరుపు లిప్పుడు స్పష్టంగా విన వస్తున్నాయి. 'కరుణ ఏది? వెతకండి! వెదకండి!' అంటున్నా రెవరో!





లోపల ఎవరున్నదీ మాకుతెలుసు. వెర్రి వేషాలు వేయకు' అన్నాడాయన. వెంటనే విజయవర్మా, కరుణాకరుడూ గుప్తద్వారం కేసి పరుగులెత్తారు. వారు బయటపడేసరికి భీమవర్మ భటుల తాపులకు గదితలుపులు బ్రద్దలయినై.

గుప్తద్వారానికి అవల ఇరుకుగా, చీకటిగా వున్న ఒకత్రోవవెంబడే వెళ్ళగా వారొక రహస్య కక్ష్యాన్ని చేరుకొన్నారు. మరి ముందు త్రోవ లేక, అక్కడే ఆగిపోయారు.

ఆ ప్రమాదసమయంలో కరుణ విజయవర్మకు తన కథంతా చెప్పింది. తానొక జమీందారు కూతురుసనీ, అనాథురాలు కావడంవల్ల చిన్నప్పటినుంచీ చంద్రదుర్గాధిపతియింట పెరిగాసనీ, ద్రోహబుద్ధి గల భీమవర్మ తనను బలిమినిపట్టి తెప్పించి పురుషవేషం ధరింపచేశాడని కూడా చెప్పింది.

ఆ కథఅంతా వినగానే విజయవర్మకు చాలా జాలివేసింది. 'బొందిలో ప్రాణం వుండగా, ఇక నిన్ను వీడను' అని ప్రతిన చేశాడు.

అంతలో మళ్ళీ అడుగుల సందడి వినిపించింది. తిరిగిచూస్తే రాంసింగు. 'అహా! ఉన్నారు ఇక్కడే. ఇంకేం, అనుకొన్నంతపనీ జరిగింది' అన్నాడు అతను. విజయవర్మ నిశ్శబ్దంగా చురకత్తి ఎత్తాడు.

'అగవయ్యా! పెద్దమనిషీ! పారిపోవడానికి త్రోవ కనబడలేదా? నే చూపిస్తాను!' అన్నాడు రాంసింగు. విజయవర్మకు అప్పుడు అర్థమయింది రాంసింగు తమ మిత్రుడేసని; రాంసింగు వారికి ఇంతకు ముందే భీమవర్మదూత పోయిన రహస్య ద్వారం చూపించాడు. గోడనున్న రాతి పలక తొలగించగా త్రోవ ఏర్పడింది. వెంటనే పారిపొమ్మని వారికి సలహాచెప్పి రాంసింగు అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

విజయవర్మా, కరుణా అత్రోవనే వెళ్ళి కోటగోడను చేరుకొన్నారు. అక్కడ భీమవర్మ దూత దిగిపోయిన కిటికీ వుంది. దాని చువ్వల కింకా త్రాడు వేలాడుతూనేవుంది. పరవా లేదని అనుకొన్నాడు విజయవర్మ. ఇంతలో వెనుకనుంచి కేకలు వినవచ్చాయి.

'రా, కరుణా! ఆలసిస్తే లాభం లే' దన్నాడు విజయవర్మ. కాని కరుణ కిటికీ లోంచి ఆ అగాధంలోకి తొంగిచూచి గజగజ వణకిపోయింది. భీమవర్మ భటులు రానే వచ్చారు. ఏమయితే అయిందని విజయవర్మ కరుణను వదిలేసి త్రాడు పట్టుకొని దూకేశాడు. పైనుంచి బాణాలవర్షం కురిసింది. కాని విజయవర్మ లెక్కచేయకుండా అగడ్త ఈది అవతలకు చేరాడు. పొదల మాటున ఇక భయం లేకపోయింది.

కొంతదూరం వెళ్ళినతరువాత త్రోవలో అతనికి, శబ్దవేధి బాణానికి ఆహుతి ఐన భీమవర్మ దూతశవం కనుపించింది. తడిమిచూడగా ద్రోహిభీమవర్మవిపక్షంలో కలిసిపోతానని దేవదుర్గాధిపతికి వ్రాసిన జాబు కనబడ్డది. ఎందుకైనా మంచిదని ఆ జాబు తనవద్ద అట్టేపెట్టుకొన్నాడు విజయవర్మ.

కొంచెందూరం వెళ్లగానే అతనికి శబ్దవేధి దళంవారు కనుపించారు. ఈసారి వారివెంట నాయకునివద్దకు వెళ్లటానికి విజయవర్మ వెనుదీయలేదు. శబ్దవేధి ఐన చండీదాసు అతనిని హృదయపూర్వకంగా ఆహ్వానించాడు. 'కరుణను వెనుక వదలి రావటం తెలివిగల పని' అని విజయుణ్ణి ఊరడించాడు.

'నీ సంగతిఅంతా తెలిసిపోయింది. ఇక చూసుకో' అంటూ విజయుడు భీమవర్మకు ఒక ఉత్తరం రాశాడు. ఆ ఉత్తరంచూచీ చూడటంతోనే భీమవర్మ పళ్ళు పటపట కొరికాడు. —(ఇంకా వుంది)





# పెద్దవాళ్లతో పని

అది ఒక కారడవి. మిట్టమధ్యాహ్నపువేళ. ఎండ మహా తీక్ష్ణంగా వుంది. అటువంటి సమయంలో ఒక నక్క విపరీతమైన దాహంవేసి బయలుదేరింది. దగ్గరలోనే ఒక కొలను కనబడేసరికి, ఆ నక్క దప్పిక తీర్చుకొని, కొలను ఒడ్డునే ఒక చెట్టుకింద విశ్రమించింది.

అదే సమయానికి ఒక తోడేలు అక్కడికి వచ్చింది. నక్కను చూడగానే దానికి సంతోషం కలిగింది. నక్కకు ధైర్యం సాహసం లేవుగాని, అది జిత్తులమారి అన్న సంగతి దానికి బాగా తెలుసు.

"ఏమోయి తమ్ముడూ! తీరికగా కూర్చున్నావ్? వేట మంచి జోరుగా సాగి నట్టుందే!" అన్నది, తోడేలు.

"వేటా లేదు, నా తలకాయా లేదు. ఎండ మండిపోతూ, గొంతుక ఎండిపోతూ వుంటే, వేట యెక్కడ? ఐనా, ఏం వేట లెద్దూ. రోజూ కోళ్లను తినితిని జిహ్వ చచ్చింది" అని నిస్పృహగా బదులు చెప్పింది నక్క.

ఈ మాటలు వినగానే తోడేలుకు ఏదో చప్పున గుర్తుకు వచ్చినట్టయింది.

"అదేరా తమ్ముడూ, నీలాగే నేనూ బాధ పడుతూవుంట. ఎన్నాళ్ళూ లేళ్లూ, పొటేళ్లూ తప్ప మరేమీ లేక, నాకూ చవి చచ్చిందంటే నమ్ము" అన్నది మళ్ళీ తోడేలు.

అంతలో ఎక్కడినుంచి వచ్చిందో, ఒక చిరుతపులి అక్కడికి వచ్చి కలసింది. దానిని చూస్తూనే, నక్కా తోడేలూ తోకలు ఝాడించి, చెవులు ఆడించి, భక్తితో తలలు వంచి నమస్కరించినై.

"ఓహో, బావమరదులు బాతాఖానీలో పడ్డారే. భారీయెత్తున యేదో వేట సాగించి

కె. పద్మనాభం




సట్టుందీ !" అంటూ పలకరించింది చిరుతపులి. అక్కడనే ఒక చెట్టుకు ఆనుకొని స్తిమితంగా నీడని కూర్చొన్నది.

నక్కా తోడేలూ ముఖముఖాలు చూచుకొన్నయి. తరువాత, వినయం ఉట్టిపడేటటు గొంతుకపెట్టి, నక్క—

"బావగారి ఘాటిముందూ, దర్పాల ముందూ మేమేపాటి! ఎన్నడైనా ఇంత అడవిపంది మాంసం తిని ఎరుగుదుమా, కాస్త ఎనుబోతుబొమికకొరికిఎరుగుదుమా! మేమెంత, మా వేట ఎంత!" అన్నది.

అందుకు "ఏమిటో అనుకొంటారుగానీ, అడవిపంది మాంసమూ, ఎనుబోతూ బొమి



కలూ తినీతినీ నాలుక బెరడుకట్టుకపోయింది. బావగారూ!—తింటే ఏనుగు కుంభస్థలమే తినాలి. అదీ మగసిరి అంటే. ఏమంటారు ?" అన్నది చిరుతపులి.

చిరుతపులి పలుకులు వినగానే నక్కకు ఏదో వుపాయం తట్టింది :

"బావగారూ! నిజంగా మీరు బ్రహ్మ స్వరూపులే!! మీ రాకతో మా బాధలన్నీ పటాపంచలమయినై. మిమ్మల్ని చూడగానే మంచి ఉపాయం ఒకటి తట్టింది. మహా గొప్ప ఉపాయం సుమండీ!" అన్నది నక్క వినయంతో.

ఈ మాట వినగానే, "ఏమిటేమిటీ ?" అని తోడేలూ చిరుతపులీ చెప్పలేని ఆత్రంతో అడిగినై నక్కను.

అప్పుడు నక్క చవులూరేటటువంటి చక్కటి ధోరణిలో—

"బావగారికీ అన్నగారికీకూడా నాలుక మీది చవులు చచ్చినట్లు స్పష్టంగా తేలిపోయింది. ఇక నా సంగతి చెప్పనే అక్కర లేదు. ఈ పరిసితిలో మనం సరాసరి, మనకు పెద్ద ఐనటువంటి సింహంవద్దకు వెళ్లి, అయనతోపాటు వేటకు బయల్దేరితే బాగుంటుందని నా వుద్దేశం" అని అన్నది. ఇందుకు "భలే వుపాయం!" అని తోడేలూ



చిరుతపులీ నక్కను ఎంతో మెచ్చు కున్నాయి. నక్కచెప్పిన సలహాప్రకారం వెంటనే ఆ మూడూ బయల్దేరి మృగరాజు వద్దకువెళ్లినై. వెళ్ళి, సంగతి సందర్భాలన్నీ వెల్లడించినై. అంతా విన్నాక సింహం 'సరే' నని అంగీకరించింది.

ఇప్పుడు మృగరాజుతోసహా ఆ మూడూ కలిసి ఆ మిట్టమధ్యాహ్నపు మండు టెండలో ఏనుగుకోసం బయల్దేరినై. ముందుగా సింహం నడవసాగింది. తక్కినవి దాని వెంటబడినై.

సూర్యుడు అస్తమించేవరకూ అవి అలా తిరుగుతూనేవున్నై. కాని, ఎంత తిరిగినా. అవి ఆశించినట్టు ఏనుగు దొరికిందేకాదు, ఏనుగే కాదు, ఏనుగుజాడైనా కనబడలేదు.

చివరకు, ఆ నాలుగూ 'ఏనుగుమాట దేవుడెరుగు. ఏదో వక మాంసం దొరికితే చాలురా బాబూ, అకలి తీరటానికి' అను కునే స్థితి వచ్చింది.

అంతలోనే అదారిన ఒక లేడి పోతూ వుంటే, దానిని పట్టి అవి చంపివేశాయి.

ఆ లేడిని నక్క సమంగా నాలుగు వంతులు వేసింది. ఆకలితో నకనకలాడు తున్న తోడేలూ చిరుతపులీ వాటివంతులు అవి ఆరగించబోయినై.




"ఆగండి!" అని గర్జించింది సింహం.

"నేను మృగరాజునన్న సంగతి తెలుసు కదా? రాజునైన నాకు రెండుభాగాలు. న్యాయశాస్త్రప్రకారం నా సంతతికి ఒక భాగం. పోతే, ఇక ఒకభాగం మిగిలివున్నది. ఆ భాగాన్ని మీలో ఎవరైనాసరే, నన్ను జయించి గెల్చుకోవచ్చు!" అనిచెప్పింది.

ఇలా చెబుతూ, మృగాలకు పెద్దఐన సింహం ఆ లేడిని తన కాళ్లకిందికి లాక్కొని, యుద్ధానికి సిద్ధపడబోయింది.

'పెద్దవాళ్లతో పని ఇంతేకాబోలు' నను కొని, సింహంవేపు చూస్తూనే నక్కా తోడేలూ చిరుతపులీ చల్లగా జారుకొన్నాయి!

## 9 మాహాత్మ్యం

(1) ఏదైనా ఒక సంఖ్య తీసుకో. దానిని అటునుంచి ఇటుతిప్పి, పై సంఖ్యలోనించి తీసి వెయ్యి. తీసి వేయగా వచ్చిన సంఖ్యను 9 చేత భాగిస్తే శేషం ఏమీ మిగలదు.

ఉదాహరణ :

```
  764
  467
  ---
  297 ÷ 9 = 33.
```

—ఏ. డి. వోరా: అంబాలా (పంజాబ్)

(2) నిశ్శేషంగా 9 చేత భాగించే సందర్భంలోనే మరొక చిత్రమైన ఉదాహరణ ఇదిగో:

864 అనే సంఖ్య తీసుకొని వివిధంగా తారుమారుచేసి వేసినా, దానిని 9 చేత భాగిస్తే శేషం మిగలదు. ఇప్పుడు ఈ 864 అనేసంఖ్యను రకరకాలుగా తారుమారుచేయగా వచ్చేమొత్తాన్నికూడా 9 చే భాగిస్తే శేషం మిగలదు.

$864 \div 9 = 96$
$846 \div 9 = 94$
$648 \div 9 = 72$
$684 \div 9 = 76$
$486 \div 9 = 54$
$468 \div 9 = 52$
$3996 \div 9 = 444$

—డి. పద్మాసన: అదవాని

(3) తొమ్మిదివెక్కంలో వచ్చే చమత్కారాలు మరికొన్ని—9 ని 5 పెట్టి గుణిస్తే 45 కద! 5 పెట్టి రెండు తొమ్మిదులను హెచ్చవేస్తే మధ్యని 9 అంకెతోసహా అదేమొత్తం వస్తుంది. అనగా 4 కూ 5 కూ మధ్యని 9 = 495. మచ్చుకి: $9 \times 5 = 45$. $99 \times 5 = 495$. ఇలాగే తక్కిన అంకెలన్నీ.

$9 \times 2 = 18 \ldots 99 \times 2 = 198$
$9 \times 3 = 27 \ldots 99 \times 3 = 297$
$9 \times 4 = 36 \ldots 99 \times 4 = 396$
$9 \times 5 = 45 \ldots 99 \times 5 = 495$
$9 \times 6 = 54 \ldots 99 \times 6 = 594$
$9 \times 7 = 63 \ldots 99 \times 7 = 693$
$9 \times 8 = 72 \ldots 99 \times 8 = 792$
$9 \times 9 = 81 \ldots 99 \times 9 = 891$
$9 \times 10 = 90 \ldots 99 \times 10 = 990$

—గిరిజాశంకర్, వి. మెస్త్రా: సిర్సి

(4) 0- మొదలుకొని 9 వరకు అంకెలువెయ్యి. ఇప్పుడు మళ్ళీ 9 మొదలుకొని 0-వరకూ పై సంఖ్యలకు కిందనే వేసుకొంటూరా. రెండు సంఖ్యలూ కలిపి మొత్తమెంతో గమనించు.

```
 0 1 2 3 4 5 6 7 8 9
 9 8 7 6 5 4 3 2 1 0
 -------------------
 9 9 9 9 9 9 9 9 9 9
```

—బి. వివేకానందన్ - విళ్ళుపురమ్

—[వచ్చేనెల మరికొన్ని]




# శాంతిదేవత

పూర్వకాలమందు కొంతమంది కత్తిని ఆశ్రయించి బతికేవాళ్ళు. అనగా, కత్తిని చేతపట్టి యుద్ధాలలో పాలొని జీవనం సాగించేవారు.

అలా అనేక యుద్ధాలలో పనిచేసిన మహాయోధుడు శూరసింహుడు. అతనికి ఒకానొకప్పుడు ఉద్యోగం లేకుండాపోయింది.

ఏమీ?—రాజులకు యుద్ధాలంటే విసుగుపుట్టింది. అందుచేత వారిలో వారు సంధులు చేసుకొన్నారు. అస్త్రశస్త్రాలన్నీ మూల పారవేశారు. రాజ్యం ప్రశాంతంగా వుంటే యుద్ధమెందుకు? సైనికులెందుకు?

ఇప్పుడు శూరసింహుడికి గట్టిచిక్కే వచ్చింది. అతనికి చేతనైన పనిఒక్కటే— కత్తి చేతపట్టటం. ఎన్ని తలలైనా అవలీలగా నరికివేయగలడు. మరిప్పుడు యుద్ధం పని లేదాయె. వానికి మరేపనీ చేతకాదాయె. ఎలా?

"రాజులంతా పిరికిపందలైపోయారు! ప్రజలంతా పౌరుషహీను లయారు!! నా కత్తి మూలపడపలసిందేనా? తుప్పు పట్టవలసిందేనా?" అని అతనికి తీరని విచారం కలిగింది.

ఏమైతేనేం, తిండికి గుడ్డకూ మొహం వాచి, శూరసింహుడు కృశింపసాగాడు. గడ్డీ గాదం లేక అతని గుర్రం బక్కచిక్కిపోయింది. చివరకు విధిలేక ఉద్యోగంకోసం బయల్దేరాడు శూరసింహుడు.

వెళ్లగా వెళ్లగా, ఒకనాటి సూర్యోదయం వేళ ఒక పొలం చేరుకొన్నాడు. ఆ పొలం దున్నుకొంటున్న రైతును శూరసింహుడు తన గుర్రంమీదినించే కేకవేసి—

"ఓయీ, నాపేరు శూరసింహుడు, విన లేదా? నేను మహాయోధుణ్ణి. నేనిప్పుడు పని లేకుండావున్నాను. నాకేమైనా పని చూపించగలవా?" అన్నాడు.

కుమారి డి. సావిత్రి




ఈ ప్రశ్న వినగానే రైతు, దున్నటం మాని, శూరసింహుడికేసి చప్పున తిరిగి చూచాడు. ఒరలో కత్తి, వాలకం చూడగా రైతుకు భయమూ వేసింది, జాలీ కలిగింది.

"నాగలిదున్నటం చేతనైతే నాదగ్గిర పని వుంది. ముందు ఆ కత్తీ కఠారులూ అవతలపారవేసి రావయ్యా" అన్నాడురైతు.

అందుకు శూరసింహుడు "అబ్బాయీ!- నాగలిదున్నటం నాచేతకాదు. నీకు శత్రువు లెవరైనా వుంటే చెప్పు. నిమిషంలో వాళ్ల తలలు నరికి నీఎదట పెడతా. నాకు భోజనం,నా గుర్రానికి ఇంత దాణాఏర్పాటు చేస్తే చాలు. మరేమీ వద్దు' అన్నాడు.

రైతు మాటాడలేదు. క్షణకాలం శూరసింహునికేసి చూచి, మళ్ళీ ఎప్పటిలా పొలం దున్నుకోసాగాడు.

"హే !- పౌరుషహీనులు !! మనిషన్న తరవాత శత్రువే ఉండడా ? చేతకాకపోతే సరి, శత్రువును సంహరించటం ? పైగా, నన్ను నాగలి దున్నుకు బతకమంటున్నాడు ఈ పిరికిపంద. నావంటి యోధుడు చేయవలసిన పనేనా ఇది ?" అనుకొన్నాడు తనలో శూరసింహుడు.

అనుకొని అలా ఒక అరణ్యమార్గంపట్టి పోగా పచ్చటి మైదానం కంటబడింది. ఆ మైదానంలో మంచి ఎత్తున ఒక దేవతా విగ్రహం వున్నది. అదే యుద్ధదేవత !— ఉత్సాహంతో గుర్రాన్ని దౌడు తీయిస్తూ పోయి, శూరసింహుడు ఆ విగ్రహంముందు నిలబడ్డాడు.

ఆ దేవివిగ్రహం ఇరవై అడుగుల ఎత్తున వుంది. నిప్పులుచెరిగే కన్నులు, చేతులలో విచ్చుకత్తులు—భయంకొల్పుతూవున్నయి. కాని, దేవిచేతిలో కత్తి చూడగానే శూరసింహుడు సంతోషంతో ఉప్పొంగిపోయాడు.

"ఆహా ! ఏమి విగ్రహం !! అంతా అచ్చ బంగారం !!!" అని ఒక్క కేకవేశాడు, ఉత్సాహం పట్టలేక.






"కాదోయ్. విగ్రహమంతా వెండి! ఇది రజతవిగ్రహమేకాని స్వర్ణవిగ్రహం ఎంత మాత్రం కాదు," అంటూ బదులుగా అతనికి ఒక కేక వినిపించింది.

కేక వినిపించేటంతలోనే ఆ విగ్రహానికి వెనుకనుంచి డాలూ కత్తీ ధరించిన ఒక గుర్రపురౌతు ముందుకు వచ్చాడు.

పౌరుషంతో శూరసింహుడు పళ్లుపటపట కొరికాడు. ఒరలోనించి కత్తిదూశాడు.

"అరేయ్!—నా మాటనే ధిక్కరిస్తున్నావా? నా పేరెవరో తెలుసా? శూ-ర-సిం-హు-డు..."అని గర్జించాడు.

రెండవ యోధుడు వెటకారంగా నవ్వి, కత్తి ఒరలోనుండి బయటకు లాగుతూ—

"హ్హ!—నువ్వు కళ్ళులేని కబోదిలాగా ఉన్నావే! వెండికీ బంగారానికీ తేడా తెలియని నీతో యుద్ధానికి తలపడటమంటే నిజంగా నాకు అపమానకరంగా తోస్తున్నది. నాపేరెవరో తెలిసే మసులుకొంటున్నావా? నేను ధీరసింహుణ్ణి. రా, నా కత్తిబలం చవిచూపిస్తా" అన్నాడు, గుర్రాన్ని ముందుకు ఉరకలువేయిస్తూ.

మరుక్షణంలోనే యోధులిద్దరూ తలపడ్డారు. కత్తుల ఖొరిపిడితో, గుర్రాల సకిలింపులతో, వారి పరుషవాక్కులతో ఆప్రదేశం తెరిపిలేకుండా మారుమోగిపోతున్నది. అంతలో హఠాత్తుగా "ఆగండి! కత్తులు ఒరలో పెట్టండి!!" అంటూ ఒక కేక వినిపించింది. యోధు లిద్దరూ ఆ కేక వచ్చిన దిక్కుకి ఆశ్చర్యంగా చూచారు.

చూచేసరికి—మల్లిపువ్వులవంటి తెల్లటి దుస్తులు ధరించినదీ, శాంతం ఉట్టిపడుతున్న మోము కలదీ, ఒక అందమైన యువతి నవ్వుతూ వారిపద్దకు వచ్చి—

"మీ యిద్దరూ మహాయోధులే! అసహాయశూరులే!!" అన్నది.

"వాని సంగతి ఏమోకాని, నా పేరు శూరసింహుడు" అన్నాడు, మొదటివాడు.

"వానిసంగతి తెలియదుకాని, నా పేరు ధీరసింహుడు" అన్నాడు, రెండవవాడు.

ఇద్దరికేసీ చూచి, ఆయువతి "మీ కత్తుల పదునులో కాస్తంతయినా మీ బుద్ధులకు ఉంటే ఈకొట్లాట జరిగేది కాదు" అన్నది.

"మూర్ఖుడికి దూరదృష్టి లేదు. ఈ యుద్ధ దేవత విగ్రహం వెండిదట!" అని పరిహసించాడు శూరసింహుడు.

"అతనికి దృష్టి వక్రించింది. వెండివిగ్రహాన్ని బంగారువిగ్రహమని వాదించడమేమిటి, అవివేకం కాకపోతే!" అని గేలి చేశాడు ధీరసింహుడు.

అప్పుడా యువతి పకపక నవ్వి, యోధులిద్దరనూ వెంటబెట్టుకొని విగ్రహంచుట్టూ తిప్పింది. వెండిదని మొండిగా వాదించిన ధీరసింహుడుకి, విగ్రహానికి ఒకవైపు బంగారవుపూత కన్పించింది. విగ్రహం బంగారవుది అని వాదించిన శూరసింహుడికి వెండిపూత కన్పించింది.

ఇద్దరూ తెల్లబోయి, ఒకరివంక వొకరు చూచుకోసాగారు. అంతలోనే ఆ యువతి అంతర్థానమయింది. ఆమెకోసం వారిద్దరూ ఆత్రంతో అటూ ఇటూ చూడగా, ఒక దిక్కు నుంచి ఇలా వినబడింది:

"యోధుల్లారా!—నేనే శాంతిదేవతను. మీ ఇద్దరూ మహాయోధులే. మీ యిద్దరి వృద్దేశాలూ సరిఐనవే. కయ్యాలు మానండి. పౌరుషపడకండి. శాంతంగా జీవించండి!"

శూరసింహుడూ ధీరసింహుడూ గుర్రాల మీదినుంచి దిగారు. ఒకరినొకరు కౌగలించుకున్నారు. డాలూ, కత్తులూ విగ్రహంముందు పారవేశారు. నాటినుండీ వారిద్దరూ వ్యవసాయవృత్తి అవలంబించి, ప్రశాంతంగా జీవనం గడుపసాగారు.






తొమ్మిదవ శతాబ్ది ఆరంభంలో సుందర నాయనార్ అనే మహాభక్తుడు మన దేశంలో జన్మించాడు. ఆయన గొప్ప భక్తుడు మాత్రమే కాదు. అద్భుత చరితుడు.

తమిళనాడులోని 'తిరునావలూర్' గ్రామమునందు ఒక బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాడు నాయనార్. ఆ బిడ్డడు సౌందర్యమూర్తి కావటంచేతనే 'సుందరర్' అనే పేరు అతనికి సార్థకమైంది.

బిడ్డడి అందచందాలూ, వాని చురుకుదనమూ ఆ పూరి పెద్ద ఐనటువంటి 'మునరాయర్'ను ఎంతగానో ఆకర్షించినై. ఆయన సుందరర్‌ను తీసుకపోయి, తన భవనంలో అపురూపంగా, అల్లారుముద్దుగా పెంచుకొంటూవున్నాడు. యుక్తవయస్సు రాగానే ఉపనయనాది కర్మలు జరిపించాడు. పేరొందిన గురువులను పిలిపించి, బిడ్డడిని సమస్త విద్యలలోనూ ప్రవీణుని చేశాడు.

క్రమంగా సుందరర్‌కు పెళ్ళియీడు వచ్చింది. సంబంధం నిశ్చయమైంది. పెళ్ళి పీటలమీద సుందరర్‌ను కూర్చోబెడతారనగా ఒక వృద్ధుడు అక్కడికి వచ్చి "ఇదేమిటయ్యా, వీడు మా కుటుంబానికి సేవకుడు. మా అనుమతి లేకుండా మీరు వీడికి పెళ్ళి ఎలా చేస్తారు? కావాలంటే ఈ పత్రం చూసుకోండి, నా మాట నిజమో అబద్ధమో తెలుస్తుంది" అన్నాడు.

అక్కడ ఉన్నవాళ్లంతా ఆశ్చర్యపోయి చూస్తూవుండగా, కోపంకొద్దీ సుందరర్ ఆ పత్రం లాక్కొని, చూడకుండానే చించి పారవేశాడు.

అప్పుడు వృద్ధుడు, ఎంతమాత్రం చలించకుండా "మాది తిరువెన్నైనల్లూర్ గ్రామం. ఇప్పుడీ కుర్రవాడు చించివేసిన పత్రం నకలుమాత్రమే. అసలు తాటాకుపత్రం మా ఇంట్లోనే వున్నదిసుమండీ!" అన్నాడు.

వి. జ్ఞానాంబ




ఇందుకు అక్కడివారందరూ ఏకమాటగా "ఏమిటయ్యా పిచ్చివాడా! బ్రాహ్మణు డేమిటి, మీకుటుంబానికి బానిసగా వుండడ మేమిటి? ఎక్కడైనా వుందా ఇటువంటి విడ్డూరం! వెళ్ళువెళ్ళు. నీదారిని నీవు పోవయ్యా" అంటూ కేకలువేయసాగారు.

వాళ్ల కేకలతో ముసిలివాడు మరింత రెచ్చిపోయాడు. ఈ వివాహం జరగటానికి ఏమీ వీలులేదన్నాడు. అప్పుడు సుందరర్ 'ఐతే, ఆ పత్ర మేమిటో చూపించు' మని వెంటబడ్డాడు. వృద్ధుడు ఒక తాళపత్రం తెచ్చి గ్రామస్థులముందు పెట్టాడు. అది సుందరర్ తాతగారు వ్రాసిన పత్రం.



"మేమూ, రాబోయే తరాలవారమూకూడా తిరునావలూరు సైతాన్ (అనగా పిచ్చివాడన్న మాట)కు సేవకులుగా ఉండగలవారము" అని అందులో స్పష్టంగా వ్రాసివున్నది.

ఈ పత్రం అందరకూ వింత గొలిపింది. గ్రామంలో పంచాయతీ చేశారు. సుందరర్ తాత ఇంతకుముందు వ్రాసివున్న పత్రాలు కొన్ని తెచ్చి, సంతకం పోల్చిచూచారు. ఇవన్నీ పరీక్షచేసినమీదట, "ఈ పత్రం పిల్లవాని తాతగారు వ్రాసినదనటానికేమీ సందేహంలేదు" అని ఆవూరి పంచాయతీ దారులు తీర్పుచెప్పారు.

"ఐతే, మీ ఇల్లెక్కడో చూపించవయ్యా!' అని ముసిలివానిని గద్దించగా, ఆ వృద్ధుడు నవ్వుతూ, "రండయ్యా, రండి!!" అంటూ వారిని తీసుకవెళ్ళి, గర్భగుడిలోపల దూరిపోయి అంతర్హితుడయ్యాడు.

ఆ క్షణమందు సుందరర్‌కు నిద్రనుండి లేచినట్టనిపించింది. ఆ క్షణమందే జ్ఞానోదయమై, పూర్వజన్మస్మృతి కలిగింది.

క్రిందటి జన్మలో ఒకప్పుడు ఈసుందరర్ అనే కుర్రవాడు కైలాసపర్వతానికి పోయి, పార్వతీదేవి పక్కన వుండే అందాల పరిచారికలను ఇద్దరను చూడగానే "ఇటువంటి అప్సరసలను పెళ్ళాడని జన్మ





ఎందుకు !" అని మనసులో అనుకొన్నాడట. ఇందుకు పరమేశ్వరుడు కోపించి 'నీవు భూలోకమందు మాకు సేవకునిగా జన్మించవలసింది' అని శపించాడట.

సుందరర్ పరమేశ్వరుని కాళ్ళమీద పడ్డాడు. పరమేశ్వరుడు తన భక్తునిమీద జాలివేసి, తరుణోపాయం అనుగ్రహించాడు. ఈ శాపంవల్లనే సుందరర్‌కు భూలోకమందు మానవ జన్మ కలిగింది.

పోతే—జ్ఞానోదయం కలిగిన క్షణంనించీ సుందరర్‌కు రోజురోజూ ఈశ్వరభక్తి ఎక్కువ కాజొచ్చింది. అతను వరుసగా దేశంలోని శైవక్షేత్రాలన్నీ దర్శింపనారంభించాడు. వెళ్ళిన చోటల్లా మృదుమధురమైన కవిత్వంతో తన్మయత కలిగేటట్టు ఈశ్వరుని స్తుతించేవాడు.

సుందరర్ దర్శించిన శైవక్షేత్రాలలో అతనికి భగవంతుడు చిత్రమైన అనేక మహిమలు చూపిస్తూ వచ్చాడు.

సుందరర్ చిదంబరం, తిరువారూర్ వెళ్ళాడు. తిరువారూరులో ఉండగా 'పరవై నాచ్చియార్' అనే పిల్లతో అతనికి వివాహమైంది. ఈ నాచియారే క్రిందటిజన్మలో తను వరించిన పార్వతిదేవి పరిచారికలలో ఒకతె అనేసంగతి పూర్వజ్ఞానంవల్ల సుందరర్




గ్రహించాడు. సుందరర్ 'తిరువత్తియూర్' గ్రామం చేరుకొన్నాక భగవంతుని ఆజ్ఞను శిరసావహించి, 'సంగిలి నాచ్చియార్' అనే మరిఒక కన్యను వివాహం చేసుకొన్నాడు.

ఈ సంగిలినాచ్చియార్ అతిలోకసుందరి. ఆనాడు పార్వతిపక్కని తను చూచిన రెండవ పరిచారికగా వుండిన అప్సరసే ఈ సుందరి అని సుందరనయనార్‌కు అవగాహనయింది. ఒక బిల్వవృక్షంకింద యీమెను సుందరర్ వివాహం చేసుకొన్నాడు. "ఎన్నడూ నిన్ను విడనాడను" అని అతనివద్ద ప్రమాణం తీసికోమని పరమేశ్వరుడు ఆమెను పురికొలిపాడు. అలానే





ఆమె పెళ్ళికి ముందు మాట తీసుకొన్నది. అయితే తొందరపడి మాట యిచ్చాడేగాని తరవాత సుందరర్ ఆలోచనలో పడ్డాడు–

'అయ్యో, ఇక్కడినుంచి కదలనని ప్రమాణంచేశానే. మరి, తక్కిన క్షేత్రాలు దర్శించడం ఎలాగా!' అని జిజ్ఞాస కలగగానే 'స్వామీ!–నేను తొందరపడి ఈమెకు మాటయివ్వటంవల్ల ఇక కదలటానికి వీలు లేకపోతున్నది. కనుక నీవే ఈ వృక్షంలో శాశ్వతంగా ఉండిపోవలిసింది' అని ఈశ్వరుని ప్రార్థించాడు.

సంగిలినాచ్చియార్ వద్ద కొంతకాలం వుండేసరికి, సుందరర్‌కు మళ్ళీ తక్కిన క్షేత్రాలు దర్శించుకొందామనే కుతూహలం కలిగింది. మాట తప్పిన సంగతి తెలిసే, తిరువత్తియూర్ దాటి మరొక క్షేత్రానికి పోబోయాడు. ఐతే, సుందరర్ ఊరిపొలిమేర దాటేసరికల్లా అతనికి రెండు కన్నులూ కనబడకుండా పోయినై.

గుడ్డితనంతోనే సుందరర్ భక్తి విడువకుండా ఆవేశపూరితమైన శ్లోకాలు చెప్పి స్వామిని ప్రార్థించుకొంటూ క్షేత్రాలు సేవింప సాగాడు. కాని, దృష్టి తప్పినా పర్యటన మానలేదు. ఆ పట్టుదలతోనే కర్ర చేత పుచ్చుకొని, తడుముకొని అడుగులు వేసుకొంటూ, కంచి వెళ్ళేసరికి ఎడమకన్ను కనిపించనారంభించింది. తిరువారూరు చేరుకొనేసరికి పూర్తి దృష్టి వచ్చేసింది.

ఈలోపల మొదటిభార్య ఐన పరవైనాచ్చియార్‌కు ఇతను రెండవపెళ్ళి చేసుకొన్న సంగతి తెలిసి, సుందరర్‌ను యింట్లో అడుగుపెట్టవద్దన్నది. అప్పుడు సుందరర్ తన యిష్టదైవాన్ని వేడుకొగా, పరమేశ్వరుడు ప్రత్యక్షమై, యిద్దరికీ మళ్లీ స్నేహం కలిపాడట.

ఈ సంగతి తెలిసి 'కలిక్కామనాయనార్' అనే ఒక భక్తుడు ఉగ్రుడై సుందరర్‌వద్దకు వెళ్ళి "ఏమిరా నీపొగరు! పరమేశ్వరుణ్ణి

వశపరచుకొని, నీ సంసార విషయాలలో దూతగా ఉపయోగించుకొంటావా?'' అంటూ తిట్టనారంభించాడు.

తన భక్తులు పేచీపడటం పరమేశ్వరునికి ఇష్టంలేక, ఒక యుక్తిచేశాడు. స్వామి మహిమవల్ల కలిక్కామ నాయనారుకు శూలనొప్పి కలిగింది. అది కుదర్చటంఎవళ్ల వల్లనూ కాలేదు.

చివరకు పరమాత్ముడు అతనికి కలలో కనిపించి 'ఓయీ నాయనార్!—నీ బాధ కుదర్చటానికి సుందరర్ ఒక్కడే సమర్థుడు' అని చెప్పాడు.

కాని కలిక్కామనాయనారుకు సుందరర్‌ను ఆశ్రయించడమనేది అంతకంటే ఎక్కువ బాధగా తోచింది. ఏమైనాకానీ ఈ బాధలనుండి విముక్తిపొందాలని, విరక్తి గలిగి కత్తితో తన పేగులు కోసివేసుకొని ప్రాణాలు విడిచాడు.

ఈ వార్త చెవినిపడగానే సుందరర్ చాలా దుఃఖించి, ప్రాణత్యాగం చేయటానికే సిద్ధపడ్డాడు. ఆ క్షణమందే పరమేశ్వరుడు ప్రత్యక్షమై, కలిక్కామనాయనారును బతికించి "భక్తులారా! మీరిద్దరూ నాకు సమానులే. ఇటుపైన స్నేహంగా వుండండి" అని హితవు చెప్పి అదృశ్యుడయ్యాడు.

తరువాత సుందరర్ అనేకమైన ఇతర క్షేత్రాలు దర్శించుకొంటూపోయి, పరమేశ్వరుని ప్రార్థించగా ఐరావతం భూలోకానికి దిగివచ్చింది. సుందరర్ దానిపైన ఎక్కగానే, అది విమానంలాగా ఎగిరిపోయి, సుందర్‌ను కైలాసంచేర్చి, ఈశ్వరుని సాన్నిధ్యమందు ఉంచింది!!

మహాప్రవక్త ఐన సుందరర్ పవిత్ర చరిత్ర వింటే, ఒక్క తమిళదేశస్థులకే కాదు, ఎవ్వరికైనా తన్మయత కలిగి తీరుతుందనటానికి సందేహంలేదు.



# కాగితపు పాత్రతో నీళ్లు కాచటం

మామూలుగా మనం వ్రాసుకునే కాగితంతో ఒక దొప్పవంటిది తయారుచేసి, అందులో—లోహపాత్రలో కాచుకొన్నట్టుగానే—నీళ్ళుపోసి కాగబెట్టవచ్చు.

ఇది వినటానికి ఆశ్చర్యంకొలిపేదిగా వుంది. కాని, దీనిని చేయటంమట్టుకు ఎంతో సులువు. కాగితంతోటి యేమిటి, పాత్ర తయారుచేయడమేమిటి ?— అనే సమస్య మొదటనే మీకు విడ్డూరం అనిపిస్తుంది.



చేయవలసిన విధానం ఇది: మామూలు కాగితం తీసుకుని, దానిని ప్రక్క బొమ్మలో చూపినప్రకారం, చదరంగాగాని, కోలగాగాని నలుప్రక్కలా, అడుగునా అకారం వచ్చేటట్టుగా మడుచు. మడతలు ఊడిపోకుండా రెండువైపులా రెండు గుండుసూదులు గుచ్చు. బొమ్మలో చూడు.

చక్కటి పెట్టె అకారంగా తయారైన ఈ కాగితపు దొప్పను చేతపుచ్చుకో. ఇప్పుడు—రెండువేపులా ఉండే గుండుసూదులకు రెండు దారపు కొసలు మెలిపెట్టి ఈ దొప్పను వేలాడదియ్యి. లేదా, చేతనైతే, నీ చెయ్యి కాలకుండా వుండేటట్టు చూచుకుని, పట్టుకొనివున్నా సరే.

ఇంచుమించు నిండుగానే, నెమ్మదిగా—తొణకకుండా—దొప్పలో చన్నీళ్లు పొయ్యి. నీటితో నింపిన ఈ దొప్పను మంటపైన పెట్టు.



మంట తగలగానే కాగితం అంటుకొని మాడిపోతుందేమో అని నీవు భయపడతావు. కాని, అలాటి భయం అవసరమే లేదు.

కాగితం ఎంతమాత్రం, కాలదు. సరికదా దొప్పలోని నీరు క్రమంగా వేడెక్కి కొద్దిసేపటికల్లా చూస్తూ వుండగానే సలసల కాగిపోతుంది.

ఇది నీవు చేయటం చూచి, నీ స్నేహితులు ఆశ్చర్యంలో మునిగిపోతారు.




# నేను మూర్ఖుణ్ణే

చిరకాలం క్రిందట ఒక వూరిలో శిలాముఖుడు అనే షావుకారు వుండేవాడు. అతడికి నగదుతోపాటు, సమస్తమైన ఫలవృక్షాలు కలిగిన పెద్దతోట వుండేది. ఆ పెద్ద తోటలో ఒక మూలని చిన్న పూరిపాక వేసుకుని అందులో అతను కాపురం ఉంటూ వుండేవాడు.

శిలాముఖుడు గడ్డుపిసినారి. తోటలో పండే ఫలాలు తను తినేవాడూ కాదు. ఒక్క ఫలమైనా ఇతరులకు ధర్మమూ చేసేవాడుకాదు.

చెట్లకాయలు కోయటానికని కూలి వాళ్లను నియమించాడు శిలాముఖుడు. ఒకసారి ఏమి జరిగిందంటే: విరగకాసి నేలకు వేలాడుతున్న మామిడీకాయలను కూలీలు కోసి బుట్టలలో నింపుతున్నారు.

కూలీలు కోసిపడవేస్తున్న ప్రతికాయనూ శిలాముఖుడు జాగర్తగా లెక్కిస్తూ "పావలా, అర్ధరూపాయి, ముప్పావలా..." అంటూ వెలలు కట్టి గుణిస్తున్నాడు. అంతలో ఒక కూలీవాడు దోరగావున్న మామిడికాయ తీసి కొరకబోయాడు. వాడిని చూస్తూనే శిలాముఖుడు—

"అబ్బ!—ఆ కాయ ఖరీదు రూపాయ. నీ కూలీ అర్ధరూపాయి. రేపు వచ్చి పనిచేస్తే బాకీ తీరిపోతుంది!" అన్నాడు.

కూలీవాడు నివ్వెరపోయాడు. ఉదయం నుంచీ కాయలు కోస్తున్న తను ఏదో నోరూరి ఒక్కకాయ నోటపెట్టేసరికల్లా 'ఖరీదు రూపాయి' అంటున్నాడే అని కోపంవచ్చింది.

శిలాముఖుడూ కూలీవాడూ మాటా మాటా పెంచుకొన్నారు. నానాతిట్లూ తిట్టుకున్నారు. అలా వాదం ముదిరి చేతులు కలిసినై. కూలీవాడు రెచ్చిపోయి శిలాముఖుణ్ణి దేహశుద్ధిచేశాడు. దాంతో శిలా

టి. బసపయ్య




ముఖుడు ఉగ్రుడై, అప్పటినించీ తోటలో కాయలు కోయకుండా అలాగే వుంచేశాడు.

ఐతే, అప్పుడప్పుడు ఆ పండ్లను చూస్తే నోరు వూరేది. కాని అంతలోనే — "ఎంత లేదన్నా ఒక్క మామిడిపండు నాలుగణాలు చేస్తుందే! అంత ఖరీదుగల పండు తిని వేస్తే యింత రాబడీ నాకు నష్టమేకదా!" అని అనుకునేవాడు.

కాలం గడుస్తూవుంది. రకరకాల పండ్లు అన్నీ పండి, రాలిపోతూండేవి. శిలాముఖుడుమాత్రం అలా చూస్తూ వూరుకునేవాడు. ఎవరైనా 'ఏమిటయ్యా అలా తోట పాడుపెడుతున్నావే?' అని అడిగితే—

"నేనేం తెలివితక్కువ దద్దమ్మ ననుకున్నావా? ఈ కూలీవాళ్ళను చచ్చినా నమ్మగూడదు. కాయలు కోయండర్రా అంటే, కోసినన్ని కోసి తిన్నన్ని తినేస్తూంటారు. పోనీ, తిన్న వాటికి డబ్బుకట్టమంటే మీదిమీదికి వస్తారు. ఎందుకొచ్చిన బాధ!" అనేవాడు.

ఒకనాడు శిలాముఖుడు తోట చుట్టి వద్దామని బయలుదేరాడు. తోటమొత్తం ఎన్ని చెట్లు వున్నాయి? ఏ చెట్టుకు ఎన్ని కాయలు గాసినై? రాలిన వెన్ని? కొమ్మల నుంచి వేలాడుతున్నవెన్ని?—ఈవిధంగా అతడు లెక్కలు వేయసాగాడు.

అలా తోటలో నడుస్తూపోతున్న శిలాముఖుడికి ఒక మామిడికొమ్మ మీద కూర్చుని శ్రావ్యంగా పాడుతున్న ఒక చిన్న అందాల పక్షి కనబడింది. అది పిచ్చికంతే వుంది. దాని తోకకు ఇంద్రధనుస్సులో కనబడే రంగులన్నీవున్నయి. ఆ చిన్నారిపక్షి మధురంగా గానం చేస్తూవుంటే, మోళ్ళుసయితం చిగిర్చేటట్టు ఉంది.

ఆ మధురగానం విని శిలాముఖుడు తన్మయుడైపోయాడు. వెనకాలే పోయి ఆ చిన్నారిపక్షిని గుప్పిట్లో చిక్కించుకొన్నాడు. ఐతే, అది గిలగిలా కొట్టుకోలేదు; కోపంతో అతనిని పొడవనూలేదు.



"శిలాముఖా! నన్ను విడిచిపుచ్చావంటే నీకు లాభించే మూడు దివ్యసూక్తులు విని పిస్తాను" అని అంది.

పక్షి నోటినుంచి ఈవిధంగా మానవ భాషలో మాటలు వినబడేసరికి శిలా ముఖుడు తత్తరపాటు చెందాడు.

"నిజంగా లాభించే సూక్తులే చెబుతావా?" అని ప్రశ్నించాడు. 'లాభించటం' అంటే ధనరూపంలోనేగదా అనుకున్నాడతను.

"అవును! నిజంగా లాభించే సూక్తులే చెబుతాను" అన్నది పక్షి.

మారుమాటాడకుండా శిలాముఖుడు పక్షిని గుప్పెటనుంచి వదిలాడు. అది ఎగిరి పోయింది. 'లాభం' అన్నమాట ఎప్పుడైతే, చెవినిబడిందో ఆ క్షణమందే అతడికి గల కాస్త యింగితమూ ఇగిరిపోయింది.

ఆ పక్షి రివ్వుమని ఎగిరిపోయి, సమీపాన మామిడికొమ్మమీద వాలింది. శిలాముఖుడు నోరుతెరుచుకుని ఏమిచెబుతుందా అని చెవులురిక్కించి వున్నాడు.

"ఇదుగో, నేను చెబుతానన్న సూక్తుల్లో మొదటిది—లేనిదానికోసం విచారించకు!" అని అన్నది, పక్షి.

"ఈమాత్రం నాకు తెలియదా? ఇలాంటి నీతులన్నీ చిన్నతనంలోనే చదువుకున్నా. నీ పిచ్చికబుర్లు వినేటందుకు నే మూర్ఖుణ్ణి కాను!" అన్నాడు శిలాముఖుడు, కోపంగా.

"శిలాముఖా! నిజంగా నువ్వు మూర్ఖుడివే. కాకపోతే, అంతసేపు నన్ను గుప్పెట్లో వుంచుకునికూడా నా శరీరంలో మణుగు బంగారం వున్న సంగతి గ్రహించనేలేక పోయావే!" అన్నది పక్షి.

"మణుగు బంగారమే! ఒక మణుగు!! అయ్యో, నిన్ను వదిలిపెట్టి ఎంత పొరపాటు చేశాను?" అని విచారించాడు శిలా ముఖుడు.

ఇందుకు పక్షి పకపక నవ్వి, రెక్కలు టపటపలాడించింది. "శిలాముఖా! నువ్వు



మూర్ఖుడివే. పరమమూర్ఖుడివి. చిన్న పిచ్చికంత వున్న నాలోపల మణుగు బరువుగల బంగారం వున్నదంటే ఎలా నమ్మగలిగావు, పిచ్చివాడా ?" అన్నది పక్షి.

శిలాముఖుడు పళ్ళు కొరికి, గుడ్లు ఇంతింత చేశాడు. అప్పుడు పక్షి అతనితో మళ్ళీ ఇలా అన్నది :

" ఇక రెండవ సూక్తి విను ! యితరులు చెప్పింది అంతా నిజమే అనుకోకు !"

'ఇదీ నేను చిన్నతనంలో చదువుకొన్నదే. ఇందులో మాత్రం కొత్త యేముంది !' అన్నాడు శిలాముఖుడు గుడ్లురుముతూ.

" అన్నీ తెలుసుననుకునే తెలివితక్కువ దద్దమ్మవు నువ్వు. ఇక మూడోసూక్తి విను : గుప్పెట్లోచిక్కిన లక్ష్మిని వదులుకొని, చెట్టుకొమ్మలమీద వెతకకేం !" అన్నది పక్షి.

ఈమాటకు శిలాముఖుడు తల నేలకు కొట్టుకొని, "అవును నిజంగా నే మూర్ఖుణ్ణే !" అని ఈసారి ఒప్పుకొన్నాడు.

ఆ సమయంలో తోటమధ్యని ఒక పెద్ద గాలి లేచింది. ఎండిన ఆకులనూ అలములనూ గిర్రుమని సుడులు తిప్పుతూ, ప్రతి చెట్టునూ సమీపించింది. ఆ సుడిగాలి వేళ్ళతోకూడా బ్రహ్మాండమైన వృక్షాలను సైతం నేల కూల్చింది.

భయంతో కళ్లుమూసుకున్నాడు శిలాముఖుడు. కళ్ళు తెరిచిచూస్తే ఏముంది?— తోటలోని చెట్లన్నీ కూకటివేళ్ళతోసహా పెల్లగింపబడివున్నాయి !! చెట్టుకొమ్మమీది ఆ చిన్నారిపక్షి అంతర్థానమైంది. అతను నివసించే పూరిపాక కప్పుకూడా ఎగిరిపోయి మొండిగోడలుమాత్రం ఆనవాలున్నయి.

" లక్ష్మిదేవి సకలైశ్వర్యాలూ యిచ్చింది. ఐతేనేం ? నేను అనుభవించలేదు ; యితరుల్నీ అనుభవించనియులేదు. చివరకు అంతా నేలపాలైంది. నిజంగా నేను మూర్ఖుడినే !" అనుకొంటూ పరిపరివిధాల విలపించాడు శిలాముఖుడు.



# అట్టవిూది బొమ్మ

పాండవులైదుగురనూ ఎలాఐనా హతమార్చాలెనని దుర్యోధనుడు కాంక్షపట్టి వున్నాడు. తన పరివారంతో నిరంతరమూ సలహాలుచేస్తూనే వున్నాడు. అనేక మైన వ్యూహాలు పన్ని అవన్నీ విఫలములైన తరువాత చివరకు ఒకేఒక అమోఘ మైన వుపాయం పన్నాడు. అదేమిటి అంటే :

కనకుడు అనే గొప్ప శిల్పిని రప్పించి, అందమైన ఒక లక్కయింటిని సృష్టించాడు. 'మీ అన్నదమ్ములందరూ ఈ ఇంట్లో ఉండండి' అని ధృత రాష్ట్రునిచేత పాండవులకు హితవు చెప్పించాడు. ఆ ప్రకారం వచ్చి, పాండ వులు లక్కయింటిలో మసులుతూవుండగా చూచి, ఒక రోజున ఆ యింటికి నిప్పు ముట్టించుమని 'పురోచను'డనే ఆంతరంగికునితో యేర్పాటుచేసివుంచాడు.

ఐతే—పాండవపక్షపాతి ఐన విదురునివలన భీమసేనుడు ముందుగానే ఈ యేర్పాటు తెలుసుకొన్నాడు. పురోచనుడు లాక్షాగృహాన్ని దహనంచేయ బోయే సమయంకూడా తెలుసుకొన్నాడు.

ఈ పరిస్థితులన్నీ గ్రహించి, అంతకుముందుగానే తవ్వి ఉంచిన ఒక రహస్యసొరంగంద్వారా భీముడు గాఢనిద్రలో వున్న తన తల్లి కుంతీదేవినీ, సోదరులనందరనూ ఎత్తుకుతీసుకుపోయి గంగానది ఒడ్డుకు చేర్చాడు. విదురుని ఏర్పాటుప్రకారం అక్కడ ఆ సమయాన సిద్ధంగా వున్న ఒక పడవ పాండవు లనూ కుంతీదేవినీ ఎక్కించుకుపోయి, సురక్షితమైన ఒక ప్రదేశమందు దిగబెట్టింది. తరువాత భీమసేనుడు మరలివచ్చి, పురోచకునికంటె ముందుగా తనే లక్కయింటికి నిప్పుముట్టించివేశాడు. చిటికసేపటిలో లాక్షాగృహం పురోచకుడితోసహా భస్మీపటలమై వూరుకొన్నది.

తెల్లవారగానే అక్కడ బూడిదమాత్రమే కనబడింది. పాండవులందరూ చచ్చివుంటారని దుర్యోధనాదులు సంతోషించారు. ఈ ఘోరవార్త విని భీష్మా దులు దుఃఖించారు. అందరితోపాటు విదురుడున్నూ దుఃఖం నటించాడు. పురోహితులను రప్పించి చచ్చారనుకొన్న పాండవులకు, కౌరవులు ఉత్తర క్రియలు జరిపించారు. ధృతరాష్ట్రుడుకూడా పాండవులకు తిలోదకాలు వదిలాడు. దగ్ధమైన లక్కయింటినిగురించి తనప్రజ్ఞ తలుచుకొని దుర్యో ధనుడు పొంగిపోయాడు.




పూర్వకాలమందు రాజపుత్రస్థానంలో అనేకమైన చిన్నచిన్న సంస్థానాలు ఉండేవి. అటువంటివాటిలోదే 'మీవార్' సంస్థానం. మీవార్‌కు ముఖ్యపట్టణం చిత్తూరు.

మీవార్‌ను పాలించే రాజులు 'రాణాలు.' అటువంటివారిలో ఒకడు 'రత్నరాణా.'

రత్నరాణాకు తన పదవితో తృప్తి కలగలేదు. ఇరుగుపొరుగు రాజులనందరినీ వశంచేసుకోవాలనీ, వాళ్ళవద్ద కప్పం వసూలుచేసి చక్రవర్తి ననిపించుకోవాలనీ బుద్ధిపుట్టింది. పుట్టగానే, 'మీరంతా వచ్చి నాకు పాదాక్రాంతులై, కాన్కలు చెల్లించివెళ్లండి' అంటూ వారందరకూ రాయబారాలు పంపించాడు.

చిత్తూరుకు అరవైమైళ్ళలో 'బూందీ కోట' అనే ఒక కోట వుంది. బూందీ సంస్థాన ప్రభువు సురాజమల్లుడు చాలా పరాక్రమశాలి. చిత్తూరునుండి వచ్చిన రాయబారి తన మాటలు చెప్పగానే, తోక తొక్కిన తాచులాగా లేచాడు సురాజమల్లు.

రాయబారి హడలిపోయాడు. వెనుకకు తిరిగిచూడకుండా, తిరుగుదారిపట్టి పోయి, జరిగినదంతా పూసగుచ్చినట్టు రాణాకు మనవిచేశాడు.

రాణా మండిపడ్డాడు. బూందీకోటపైకి దాడివెళ్లటానికి సైన్యాలను సిద్ధం చేయవలిసిందని అజ్ఞాపించాడు.

'బూందీ ప్రభువు చాలా బలవంతుడు. అతని సైన్యంలోని ప్రతి రాజపుత్రుడూ గొప్ప పౌరుషవంతుడు. అటువంటివానితో కయ్యం పెట్టుకోవటం పనికిరాదు' అని అనేకవిధాల రాణాకు చెప్పిచూచారు సంస్థానంలో మంత్రులూ, సేనాధిపతులూ కూడా. కాని, ఎవ్వరిమాటా రాణాకు చెవికెక్కలేదు. అందరి సలహాలనూ తోసిపుచ్చి, సైన్యాన్ని వెంటబెట్టుకపోయి బూందీ

పాలంకి వెంకటరామచంద్రమూర్తి

కోటను రాణా వెంటనే ముట్టడించాడు. రత్నరాణా కొలువులో లాలాజీఅనే పేరుగల రాజపుత్రుడున్నాడు. అతను బూందీకోటలో పుట్టినవాడే. బూందీప్రభువైన సురాజమల్లునితో అతనికి చుట్టరికంకూడా వున్నది.

ఐతే—ఏదో ఒక సందర్భంలో మాట పట్టింపు రావటంవల్ల లాలాజీ, కొంతమంది సైనికులను తన వెంటబెట్టుకొని, బూందీ పట్టణం వదలిపోయి, రాణాకొలువులో కుదురుకొన్నాడు.

రాణా బూందీకోటను ముట్టడించటానికి వెళ్ళినప్పుడు లాలాజీ చిత్తూరులో లేడు. ఏమంటే — "సైనికులతోసహా ఫలానా గ్రామానికి పోయి పన్ను వసూలుచేసుకు రావలిసింది" అని రాణాయే అతనిని ఎక్కడికో పంపాడు.

తనకు ఇట్టె వశమైపోతుందికదా బూందీ కోట అని అనుకొన్నాడు రాణా. కాని, బూందీప్రభువు ఐన సురాజమల్లుడు బలవంతుడు. పైగా చతురుడు. ఫలానా రాణా తనపైకి దండెత్తివస్తున్నాడనే వార్త తెలిసీ తెలియటంతోనే చకచకమంటూ గొప్ప ఏర్పాట్లు కొన్ని చేశాడు. ఒక సంవత్సరం పాటు రాజకుటుంబానికీ పరివారానికీ సరిపడ్డ భోజనసామగ్రితో కోట నింపేసి,




తలుపులు మూయించివేశాడు. రత్నరాణా సేనలతోసహా కోటబయట విడిసి, ఇదంతా చూడగా ఏమీ చేయలేక ఆలోచనలో పడ్డాడు. ఎత్తయిన కోటగోడలు, లోతైన కందకాలూ దాటిపోదామా అంటే ఎంత మాత్రమూ వశం కాలేదు.

ఇలా వుండగా, కోటపైనుండి బాణాలూ, బండరాళ్ళూ, వేడివేడి చమురుధారలూ వచ్చిపడటంతో కిందనున్న సైనికులు నాశనం కాజొచ్చారు.

ఈస్థితిలో రాణా 'బూందీకోట వశం కావాలి, అప్పుడునేను భోజనం చేయాలి!' అంటూ ప్రతిజ్ఞకూడా పూనాడు.



ప్రతిజ్ఞ పూనిసంతమాత్రాన కోట వశమవుతుందా ? పరిస్థితిలో మార్పు ఏమీ కనబడలేదు. కోట అతనికి వశంకాలేదు. రాణా భోజనం చేయలేదు.

మంత్రులూ, ముఖ్యోద్యోగులూ కలిసి ఎన్నోవిధాల రాణాను భోజనం చేయమని కోరారు. ఎంత బతిమాలినా అతను పట్టు విడవలేదు. రాణా అలానే భీష్మించుకు కూర్చున్నాడు.

రోజులు గడచినకొద్దీ రాణాకు శరీరంలో నీరసం ఎక్కువగుతూవచ్చింది. చివరకు, రాజ్యంలో ప్రతివారికీ, 'మా రాణాకు ఎలా నచ్చుజెప్పటం ? అయనను ఎలా బతికించుకోవటం ?' అనే ఆత్రత పట్టుకుంది. ఈ స్థితిలో, ముఖ్యమంత్రికి ఒకానొక ఆలోచన తట్టింది. "ప్రభూ !—తాము మాట తప్పని మానధనులని లోకానికి తెలుసు. ఈ సందర్భంలోనైనా మీరు ఇప్పుడు మాట తప్పిపోనక్కరలేదు. అందుకు ఒక పని చేదాం : ఏమిటీఅంటే—మనం తక్షణమే మన చిత్తూరునగరానికి మరలిపోవటం, ఇటువంటిదే అక్కడ ఒక కోట కట్టించి, దానికి 'బూందీకోట' అని పేరుపెట్టడం, దానిని ముట్టడించి వశంచేసుకోవటం! ఇలాచేస్తే దేవరప్రతిజ్ఞ భంగంకాకుండా వుంటుందని నా వుద్దేశం" అన్నాడు.

ఈ వుపాయం రాణామనసుకు బాగా నచ్చింది. మారుఆలోచన లేకుండా, సైన్యాలను తిరుగుదారి పట్టమని ఆజ్ఞయిచ్చాడు.

అందరూ చిత్తూరునగరం చేరుకొన్నారు. ముఖ్యమంత్రి సలహాప్రకారం ఒక చిన్న కోట కట్టారు. దాని సింహద్వారంపైన 'బూందీకోట' అని అక్షరాలు చెక్కించారు. రాత్రికి ఆగి, తెల్లవారగానే మంత్రి 'కోట ముట్టడించండి! వశంచేసుకోండి !!' అని హెచ్చరించాడు.

ఆరాత్రికే లాలాజీ, వెళ్లిన పని పూర్తి చేసుకొని, తన పరివారంతోనూ సైన్యం






తోనూ చిత్తూరుకు తిరిగివచ్చాడు. వచ్చేసరి కల్లా అక్కడ కనబడుతూవున్న చిన్నకోటను చూచి 'ఇదియేమిటి?' అని అడిగాడు. సంగతిసందర్భాలు విని, 'ఏడిచినట్టే వుంది రాణా పాలన!' అనేశాడు.

తెల్లవారగానే రాణా సేనాధిపతి, నాలుగు ఏనుగులనూ, పాతిక గుర్రాలనూ, కొద్దిగా సైన్యాన్ని తీసుకొని నకలు బూందీకోటకు వెళ్లాడు. కోటను ముట్టడించినట్టు నటించి, అట్టహాసంగా "కందకాలు దాటండి! కోట గోడలు ఎక్కండి!!" అంటూ, పెద్దకేకలతో కోలాహలం చేయసాగారు.

మితిమీరిన ఉత్సాహంతో సైనికులు "రాజాధిరాజుకూ జై! రత్నరాణాకూ జై!!" అని జేజేలుకొట్టి, కోటగోడలు ఎక్కటానికి ప్రారంభించారు.

కాని తలవనితలంపుగా, పైనుంచి బాణాలువచ్చి తగిలి, ఎక్కడి వాళ్లక్కడనే కందకంలో పడిపోతూవచ్చారు.

'ఏమిటిది? లోపలున్నదెవరు? "కల్ల ముట్టడి" అని తలిచి మనం దాడిసాగిస్తూ వుంటే, నిజంగానే ఇంతమంది జనాన్ని చంపేశారే ఎవళ్ళో ఒక్కమాటుగా?'— అంటూ ఈవిధంగా ఆశ్చర్యపోయాడు రాణా సేనాధిపతి.

"తెరవండి తలుపులు! లోపల ప్రవేశించండి!!" అని ఆజ్ఞాపించాడు.

ఆజ్ఞాపించాడేకాని, పాషాణాలవంటి ఆ కోటతలుపులు తెరవడం అంటే మాటలా? ఎవళ్లవల్ల నవుతుంది?

చచ్చిచెడి, ఎలాగో సాధ్యంచేసుకొని, రాణాసైనికులు కోటతలుపులు తెరిచారు. తలుపులు తెరిచినా, లోపల చొరబడటానికి ఎంతమాత్రమూ వీలుకాలేదు. ఏమంటే: ఒక పందమంది సైనికులతో లాలాజీ ద్వారంపద్ద అడ్డు నిల్చుని వారిని అటకాయిస్తూవున్నాడు. లాలాజీని చూడటంతోనే రాణా సైన్యాధిపతి మండిపడి, 'ఏమోయి



వీరుడా! 'కోరి మరణం తెచ్చుకొంటావా ?' అని హెచ్చరించాడు, ఉరుముతూ.

'చావుఅంటే భయపడే రాణావారి సేనాధిపతులకే ఆ భయం. మాకుకాదు!' అన్నాడు లాలాజీ, ధీమాగా. 'బూందీకోట వశంచేసుకోలేక, చేతకాని దద్దమ్మలలాగా తిరిగివచ్చి ఇక్కడ సిద్ధమయ్యారా, పిరికి పందలు !! రోషం, పంతం ఉంటే పోయి ఆ కోటను వశంచేసుకోవాలి. ఇదేంపని ?' అనేసరికి అంతా నిశ్చేష్టులయ్యారు.

'ఇంతకూ నేనెవడినో తెలుసా? బూందీవంశస్థుణ్ణి! కలలోఅయినా బూందీ కోటకు ఇటువంటి అవమానం జరిగిందంటే నేవప్పను. అందుకే, ఈకోట ప్రవేశించాను. దీనిని కాపాడటానికి నిశ్చయించుకొన్నాను. రండి, ఎవడు వస్తాడో! బూందీవంశస్థులంటే ఎలాంటివాళ్లో ప్రతాపం చూపిస్తా!" అని అంటూ, తొడ చరచి మీసం దువ్వాడు.

లాలాజీసేనలకీ,మీవార్‌సేనలకీ మధ్యని గొప్పయుద్ధం జరిగింది.

లాలాజీ సైనికులు కొద్దిమందే ఐనా, అతి పౌరుషంతో పోరాడి, మీవార్ సైనికులను ఎంతోమందిని అవలీలగా వీరస్వర్గానికి సాగనంపారు.

'కోట వశమైంది' అనే వార్త తెలియగానే ముద్దనోట్లో పెట్టుకుందాము అని విస్తరి ముందు కూర్చున్న రత్నరాణా,ఇప్పుడీవార్త తెలియగానే తన అవివేకానికి తననే నిందించుకొన్నాడు.

"కల్లముట్టడి"లోనైనా బూందీకోటకు అవమానం కలగటమనేది సహించని లాలాజీ అభిమానాన్ని రాణా ఎంతగానో మెచ్చుకున్నాడు.

పైగా, బూందీవంశస్థులతో మరెన్నడూ కయ్యానికి కాలు దువ్వకూడదు అని ఆనాడే నిశ్చయం చేసుకున్నాడు.



## బదులు చెప్పు

1. ప్రపంచంలో పెద్దగోడ ఎక్కడ?
   - హిందూదేశం
   - చైనా
   - రష్యా
2. ప్రపంచంలోకెల్లా గొప్పదైన రాజభవనం ఎక్కడ వున్నది?
   - రోమ్
   - మాస్కో
   - లండన్
3. ఎక్కువ అడవులు ఎక్కడున్నై?
   - బెంగాల్
   - మధ్యప్రదేశ్
   - అస్సాం
4. 'ఆముక్తమాల్యద'ను రచించిన కవి ఎవరు?
   - పెద్దన
   - భట్టు
   - రాయలు
5. టైప్‌రైటింగు మిషన్ మొదట కనిపెట్టింది ఎవరు?
   - ఫరాడే
   - షోల్స్
   - దేవీ
6. దుర్భిణీయంత్రం కనిపెట్టినదెవరు?
   - గెలిలియో
   - ఎడిసన్
   - వాట్

1. చైనా 2. రోమ్ 3. అస్సాం 4. రాయలు 5. షోల్స్ 6. గెలిలియో

## దూరపు కొండలు



దగ్గరగా వుండే కొండలకూ దూరాన వుండే కొండలకూ, మనకు కనపడటంలో ఎంతో తేడా వుంది.

దగ్గరగా వుండే కొండలు రాళ్ళూ రప్పలతో, చెట్టూ చేమలతో నిండి, నిజమైన రంగులో మనకు కనబడతై. దూరాన వుండే కొండలు అలా కాదు. నీలిరంగుగా కనిపిస్తాయి. ఎందుచేత?

ఇదే చిత్రం. అలా మనకు నీలి రంగుగా కనబడేది నిజంగా కొండకు గల రంగు కానేకాదు. అది గాలికి గల రంగు. గాలిలో సూర్యుని కిరణాలు ప్రసరిస్తూవుంటాయి. సూర్యకిరణాలు అనేకమైన రంగులు కలిగివుంటాయని అందరకూ తెలుసు. సూర్యకిరణాలు ప్రసరించటంవల్ల గాలి నీలిరంగుగా కనిపించటంలో ఆశ్చర్యంలేదు.

రంగుపొరలు కలిగిన ఏ వస్తువునైనా కళ్లయెదుట పెట్టుకుని కొండలను చూస్తే కొండలు ఆ రంగులతోనే కనిపించటం సహజం. అలానే, గాలిలో వుండే లేత నీలిరంగు కిరణాలవల్ల దూరపుకొండలు మనకు అదేరంగుతో కనపడతాయి.




# విలువ లేని పుణ్యం

భగవానులు కడుపేద. కూలినాలీ చేసుకొని జీవనం గడిపేవాడు. సంసారం చూడబోతే పెద్దది. దోసతోటలాగా బోలెడంతమంది పిల్లలు.

తగిన రాబడి లేక, పిల్లా జెల్లతో సంసారం ఈదుకురావటం భగవాన్లుకు ఒక గడ్డు సమస్య ఐపోయింది. ఒక్కొక్కప్పుడు తిండికి లేక, వారు పస్తులుకూడా పడుకో వలసివచ్చేది.

ఇటువంటి స్థితిలో 'ఎలారా దేవుడా!' అంటూ ఆ దంపతులు రాత్రింబగళ్ళు చింతిస్తూ ఉండేవాళ్ళు.

ఇలా వుండగా—

కైలాసపురానికి ఒకప్పుడు ఒక సన్యాసి వచ్చాడు. ఈ సన్యాసి ఒక చిత్రమైనవాడు. పుణ్యంచేసుకొన్న మానవులుంటే వారు చేసిన పుణ్యకార్యాలకు విలువ కట్టి, వాటికి తగిన ధనం ఇస్తాడు.

ఈ విధంగా అనేకమంది పుణ్యాత్ములు సన్యాసివద్దకు రావటం, వారు చేసిన పుణ్యాలను తక్కెడలో వేసి తూచి, తగిన బహుమతులను సన్యాసి ధనరూపంగా ఇవ్వటం, జరుగుతూవచ్చింది. ఎంతోమంది పుణ్యజనులు సన్యాసివద్దకు వచ్చి బహుమతులు పొందుతూవున్నారనే సంగతి నిమిషంలో ఊరంతా పాకిపోయింది.

ఈ వార్త భగవానులు భార్యకుకూడా తెలిసింది. తెలిసిన క్షణంనుంచీ ఆమె ఊరుకోక, భర్తను వేపుకొని తినసాగింది.

"కాసుకు గతిలేని గర్భదరిద్రుల మైతిమే మనం. ఏమైనా దానాలు చేసివున్నామా, ధర్మాలు చేసివున్నామా? పేదవాళ్ళమిటి, పుణ్యం చేయుగలగడమేమిటి? ఏ పనిచేసినా ధనవంతులవల్ల నవుతుంది గాని..." అంటూ ఒకవిధమైన నిస్పృహతో మాటాడసాగాడు భగవానులు.

వి. లక్ష్మీపతి



"అలా కాదు. పుట్టిందిమొదలు ఇప్పటి వరకూ ఒక్కటైనా—ఏపాటి చిన్నదైనా—పుణ్యకార్యం చేయకుండా వుంటారా, విడ్డూరం! కాస్తంత జ్ఞాపకంచేసుకోండి. మన ఇరుగుపొరుగులంతా పోయి, వాళ్ళ పుణ్యకార్యాలను అమ్మేసి పందలకొద్ది రూపాయిలు మూటకట్టి తెచ్చుకొంటున్నారు. మీరూ పోయిరండి. పిల్లలూ మనం బతికి పోతాం" అని పట్టుపట్టింది, అతని భార్య.

ఇంట్లో భార్యపోరు పడలేక, ఒక రోజున దారిబత్తెం తీసుకుని భగవానులు కైలాస పురానికి బయలుదేరాడు.




అడవులు దాటి, కొండలు దాటి మజిలీలు చేసుకొంటూ పోతున్నాడు.

దారిలో—చాలామంది జనం వాళ్ళు వాళ్ళు చేసిన పుణ్యకార్యాలను జ్ఞాపకానికి తెచ్చుకొంటూ, 'నాకింత వస్తుందంటే నాకింత వస్తుం'దని అంచనాలు కట్టు కొంటూ పోతున్నారు. అందులో కొంత మంది పల్లకీలలోనూ, కొంతమంది గుఱ్ఱాల మీదా, కొంతమంది మామూలు ఎద్దుల బండ్లలోనూ వెళుతున్నారు.

ఇవన్నీ వినగా వినగా, భగవానులకు కూడా కుతూహలం కలిగింది. తను చేసిన ఏపాటి చిన్న పుణ్యమైనా, ఏ మూలైనా ఉన్నదా అని తీవ్రంగా ఆలోచింపసాగాడు.

'అయ్యో, తీరా మనం ఆ సన్యాసివద్దకు పోయి, సమాధానం చెప్పలేక తెల్లముఖం వేసుకుని తిరిగిరావలసివస్తుందేమో!' అని అతను ఎన్నోసారులు నిస్పృహచెందాడు. ఐనా, పట్టుదల వదలలేదు, ప్రయాణం మానలేదు.

అరణ్యం చివరకు వచ్చేశారు ప్రయాణి కులు. ఒకచోట ఒక బ్రహ్మాండమైన మర్రి చెట్టు కనిపించింది. దానిని చూడగానే భగవానులకు ఏవో జ్ఞాపకంవచ్చినట్టయింది.




అతని ముఖం వికసించింది. అలా వికసించటానికి గల కారణంవుంది. అది యేమిటీ అంటే:

కొన్ని సంవత్సరాలకిందట, ఒక రోజున ఈ అడవిలోనుంచే భగవానులు ప్రయాణం చేయువలసి వచ్చింది. సరీగా ఈ మర్రి చెట్టుక్రిందనే విశ్రాంతి తీసుకోవటానికని కూర్చున్నాడు. అప్పుడుకూడా అతను కైలాసపురానికే పోబోతున్నాడు. అనాడూ భగవానులు పేదవాడే.

భగవానులు బయల్దేరేముందు అతని భార్య ఎక్కడో కాస్త పిండి బదులుతెచ్చి,



దారిలోకి తినుబండారాలు చేసిపెట్టింది. భార్య తన కిచ్చిన ఆ మూట చేతపుచ్చుకొని పోయిపోయి, ఈ మర్రిచెట్టు చేరుకొన్నాడు.

ప్రయాణంచేసి చేసి అలసిపోవటంచేత మంచి ఆకలి వేసింది, దాహమూ వేసింది. అందుచేత అతను, భార్య కట్టియిచ్చిన మూట మెల్లగా విప్పి, అందులో పదార్థాలు ఇక తిందామని సిద్ధపడ్డాడు.

అంతలోనే "నాయనా! మూడురోజులయింది ముద్ద కళ్లజూచి. ఒక్క కబళం వెయ్యి నా తండ్రీ!!" అంటూ ఒక దీనాలాపన వినిపించింది.

ఇదేమిటా అని భగవానులు తిరిగిచూచేసరికి, ఒక శతవృద్ధు అతనియెదుట కనిపించాడు. భగవానులుకు హృదయం తల్లడిల్లిపోయింది. ఆ ముసలివాడు పాపం, ఊదితే ఎగిరిపోయేటట్టు వున్నాడు.

నిమిషమైనా జాగుచేయక, భగవానులు లేచి, ఆ వృద్ధుణ్ణి చేతులుపట్టి తీసుకపోయి, చెట్టుకింద తన స్థానంలో కూర్చోబెట్టాడు. తను తిందామని సిద్ధంగా పెట్టుకొన్న తినుబండారాలు అన్నీ తినమని అతనికిచ్చాడు.

ముసలివాడు సంకోచించాడు. భగవానులు బలవంతంచేశాడు. చివరకెలా ఐతే

నేం, వృద్ధుడు తినటం ప్రారంభించాడు. సగం తిన్నాక వృద్ధుడు తృప్తితో లేచి, భగవానుల్ని అనేకవిధాల దీవించి, తనదారిని తను వెళ్ళిపోయాడు.

ఇప్పుడు ఈ మర్రిచెట్టు చూడగానే ఆనాటి ఈ సంఘటన చటుక్కున జ్ఞాపకం వచ్చింది భగవానులుకి. అతని ముఖం వికసించటానికి ఇదే కారణం.

ఈపాటి దైనా ఒక చిన్నిసుకృతం గుర్తు వచ్చినందుకు భగవానులు పొంగిపోయాడు. అతనికిప్పుడు మనస్సులో కొంచెం నిబ్బరం కూడా కలిగింది.




ఈ మనోధైర్యంతో అతను మరికొంచెం గబగబ కాలు సాగించి, చివరకు కైలాస పురం చేరుకొన్నాడు.

అక్కడ—

సన్యాసి బసచేసివున్న మకాంలో జనం పట్టకుండా వున్నారు. సన్యాసికి ఎదుట ఒక కాటా తగిలించివుంది. అందులో పుణ్యంచేసుకున్నవాళ్ళు ఒక్కొక్కళ్ళే వచ్చి ఒక సిబ్బెలో కూర్చుంటారు. రెండవ సిబ్బెలో సన్యాసి ధనం కుమ్మరిస్తూ వుంటాడు. ఎవళ్ళు చేసుకున్న పుణ్యం కొద్దీ వాళ్ళకుతగిన ధనం దొరుకుతూవుంది. ఆ ధనం మూటకట్టుకొని, పని తిరగానే ఒక్కొక్కళ్లు యిళ్ళకు పోతున్నారు.

ఆ పుణ్యాత్ములైనటువంటి ఒక్కొక్కళ్లను చూస్తూవుంటే భగవానులకు బిడియం వేసింది. తనుచేసిన ఆ స్వల్పకార్యాన్ని, సన్యాసి ఎదట గొప్పగా ఎలా చెప్పుకోవటమా అని దిగులుపట్టుకొన్నది. ఇంతాచేసి, అది ఒక పుణ్యకార్యంకింద లెక్కకు రాకపోయినట్టయితే తనపని సిగ్గుచేటు ఐపోతుందే అని సంశయిస్తూ అతను వెనక్కు వెనక్కు తగ్గుతూ వచ్చాడు. శంకతో ఒకమూల ఒదిగి కూర్చున్నాడు.






భగవానులను సన్యాసి గమనించి "ఎవరవయ్యా నీవు? ఎందుకు వచ్చావు? ఏమిటి కథ?" అని కుశలప్రశ్నలు వేశాడు.

అందుకు భగవానులు జంకుతూ, "స్వామీ! బీదరికం సహించలేక నేనూ ఏదైనా చెప్పుకొని, తగిన ద్రవ్యం పుచ్చుకుందామని వచ్చాను. ఐతే, నేను చేసిన పుణ్యం ఏమంత గొప్పది కాదు..." అని నసుగుతూ బదులుచెప్పాడు.

అప్పుడు సన్యాసి "నాయనా!—పుణ్యం విషయంలో పేదా గొప్పా లేదు, కొంచెమూ ఘనతా అనేది లేదు. సంశయించక చెప్పు" అని ధైర్యంచెప్పి అతనిని ప్రోత్సహించాడు. అప్పుడు సన్యాసి అనుమతిప్రకారం అతడు కాటాలో కూర్చున్నాడు. 'నీవుచేసిన పుణ్యం ఏమిటి?' అని ప్రశ్నించాడు సన్యాసి. భగవానులు తనకు జ్ఞాపకంవచ్చిన సంగతి వెల్లడించేసరికి అక్కడ కూడివున్న జనులంతా పకపక నవ్వారు.

సన్యాసి ఆ జనాన్ని మందలించి, కాటా రెండవ సిబ్బెలో యథాప్రకారం ధనం వేయనారంభించాడు. వేశాడు. ఎంతో ధనం సిబ్బెలో వేశాడు. సుమారు బస్తాయెత్తు తూగే నాణాలు పోశాడు. భగవానులు కూర్చున్న సిబ్బె లేవలేదు. అలా మరికొన్ని బస్తాల నాణాలు పోశాడు. ఊహు. భగవానులు కూర్చున్న సిబ్బె కొంచెంకూడా కదలనేలేదు!

ఇదిచూచి సన్యాసి నివ్వెరపోయాడు. జనమంతా ఆశ్చర్యపడ్డారు. భగవానులకు ఇదేమీ అర్థంకాలేదు.

సన్యాసివద్ద ధనరాసులు తరిగిపోయినై. అతడు వినయపూర్వకంగా భగవానులకు నమస్కరించి, "మహానుభావా!—నీవు చేసు కొన్న పుణ్యం చాలాగొప్పది. విలువలేనిది. ఆ పుణ్యానికి సరిపడే ధనం ఇచ్చే సమర్థత



నాకులేదు. నన్ను మన్నించి, నావద్ద మిగిలి వున్న ధనమంతా పుచ్చుకొని, తృప్తిపడ వలసింది" అని ప్రార్థించాడు.

ఈమాటలు వినగానే భగవాన్లు గభీమని కాటానుండి లేచాడు. "యతీశ్వరా!— నిజంగా నేనుచేసిన పుణ్యం అంత గొప్పదా? అంత విలువకట్టటానికి వీలులేనిదా? ఐతే, నా సుకృతాన్ని నేను తుచ్ఛమైన నాణాలకు అమ్ముకోను. ఎంతమాత్రమూ నేను అమ్మకోను. నీ ధనం నీదగ్గరనే పెట్టుకో. దానిని, పుణ్యం అమ్ముకొనే మరెవ్వరికోసమైనా కర్చుపెట్టుకో" అంటూ మరలి పోయాడు.

అక్కడ వున్న శ్రీమంతులు, పుణ్యాత్ములు మొదలైన వేలాది జనమంతా భగవానులు చేష్టకు ముక్కుమీద వేలేసుకొన్నారు. పుణ్యాలు కొనటానికవచ్చిన సన్యాసి ఆశ్చర్యానికి మేరలేకపోయింది. అప్పుడు ఆయన భగవానుల్ని పిలిచి, "భగవాన్! నీవు పుణ్యశీలుడవే కాదు. మహా త్యాగివి. ఇప్పుడీ సాటిలేని త్యాగం చేయుటంవల్ల నీవు చేసికొన్న సుకృతం ద్విగుణీకృతమయింది. నీవు నావద్ద ప్రతిఫలం తీసుకోకపోయినప్పటికీ, ఎప్పుడో ఎక్కడో ఏ రూపంగానో నీ సుకృతాలకు తగిన ఫలం పొందేతీరాలి. ఇది దైవ నిర్ణయం!" అనిచెప్పి, ఆ క్షణమందే ఆ చోటునుండి మాయమయ్యాడు.

మరికొద్ది రోజులకల్లా భగవానులు ఇంటికి చేరుకొన్నాడు. చేరుకొనేసరికి అతని భార్య సకల ఐశ్వర్యాలతోనూ తులతూగుతూ, ఆనవాలు పట్టటానికైనా వీలు లేకుండా వుంది!

అకస్మికమైన ఈ గొప్ప మార్పునకు కారణమేమిటా అని విచారించగా, భగవానులు పెదతండ్రికి సంతతి లేక, తన ఆస్తి అంతా పుట్టుపేద ఐన భగవానులకు వ్రాసి యిచ్చాడని తెలింది.



# తేనెటీగలు ఎందుకు కుట్టుతాయి ?

తేనెటీగలు కొండితో కుట్టినప్పుడు మనకు చాలా బాధ కలుగుతుంది. తేనెటీగ కొండి అంటే ఒక సన్నని పదునైన ముల్లువంటి గొట్టం. కుట్టినప్పుడు తేనెటీగ దీనిలోనించి ఒకచుక్క విషపదార్థం వదులుతుంది.

పాటకపు తేనెటీగలు—అంటే తుట్టెలో పనిచేసేటటువంటి తేనెటీగలు మాత్రమే కుట్టుతాయి. కందిరీగల విషయంలో కూడా ఇదే చెప్పవచ్చు.

సాధారణంగా తేనెటీగలు కాని కందిరీగలుగాని ఒక్కసారిమాత్రమే కుట్ట గలవు. ఎందువల్లనంటే, ములుకులాగా ఉన్నందున దాని కొండి కుట్టి త్వరగా బయటకు తీయటానికి వీలుపడదు. బయటకు తీసికొనకముందే, కుట్టబడిన మనిషి ఉలిక్కిపడి చేతితో ఆ పురుగును దూరంగా కొట్టివేస్తాడు.



ఇందువల్ల, కొండి బయటకు లాక్కోవటానికి దానికి వ్యవధి ఉండదు. అది విరిగిపోతుంది. కొండి గలిగిన పురుగు గాయపడి చనిపోతుంది.

కొండి బయటికి లాగుకొనే వ్యవధే ఉంటే తేనెటీగలూ కందిరీగలూకూడా మాటిమాటికీ కుట్టగలవు.

ఒకానొకప్పుడు ఈ పురుగుల కొండీలు వాటికి ఇలా కుట్టటానికి పనికి వచ్చేవికావు. అప్పుడవి అండకోశానికి సంబంధించిన అవయవాలుగా ఉండేవి. తరువాత క్రమంగా అవి ఇలా విషపు ములుకులుగా మారిపోయినై.

ఐనా ఇప్పటికీ, కొన్ని తేనెటీగల కొండీలు కుట్టటానికి పనికిరావు. కనబడ్డ ప్రతివారిమీదా తేనెటీగలు దాడి చేయవు. వాటిని రెచ్చగొట్టినప్పుడుమాత్రమే అవి పెచ్చురిల్లుతాయి.

వాటి కొండీలు ఆత్మరక్షణ చేసుకోవటానికి ఉపయోగపడతాయి.

# అట్టచివరి బొమ్మ

వైశాఖపూర్ణిమ బుద్ధభగవానుడు అవతరించిన పుణ్యదినం. ఆ రోజు గొప్ప పర్వంగా ఎంచబడుతూవుంది. బుద్ధుడు పుట్టింది మనదేశంలో. ఐనా, బౌద్ధ మతం ఇతరదేశాలలోనే ఎక్కువగా ప్రచారంలో వుంటున్నది. బౌద్ధమతాన్ని అవలంబించిన దేశాలలో ఒకటి చీనాదేశం. అది మనకు చేరువనే వున్నది.

చీనాదేశం చాలా పెద్దదీ, అతి ప్రాచీనమైందిన్నీ. ప్రపంచంలో అనేక దేశాలు తిన తిండీ, కట్ట గుడ్డా ఎరుగని ఆదికాలంలోనే 'బ్రహ్మాండమైనటువంటి చీనా గోడ' (ది గ్రేట్ వాల్ ఆఫ్ చైనా)ను నిర్మించుకొని, రక్షణ చేసుకొన్న నవనాగరికదేశం. ఈ నిర్మాణం 'ప్రపంచపు ఏడువింతల'లో ఒకటైవుంది.

చీనాదేశాన్ని మరువలేము. మన నిత్యావాడుకకు పంచదారను, దీపావళి పండగకు సీమటపాకాయలు పంపేది చైనావారు. చిత్రమైన బాణాసంచాకు చీనా పెట్టింది పేరు. శిల్పాలతో వెలిగే చీనాపాత్రలూ, కాగితపు పువ్వులూ పేరుపొందినై. గారడివిద్యలో చైనీయులు గట్టివారు. పట్టుపరిశ్రమకూడా చీనావారి సొమ్మే.

ఆ దేశంలో 'కార్మొరెంట్' అనే ఒకరకం నీటికాకి వున్నది. అది చేపలను పట్టితెస్తుంది. చీనావారు దాని గొంతుకకు ఒకవిధమైన 'రింగు' అమరుస్తారు. అందువల్ల అది చేపలను పట్టితేవటమేకాని, మింగుదామంటే వీలుకాదు.

చీనాదేశీయులు దబ్బపండువంటి పచ్చటి శరీరచ్ఛాయ కలవారు. వారికి సామాన్యంగా చిట్టిచిట్టి పాదాలూ, ఎలుకతోకలవంటి జటలూ వుంటై. వారు కష్ట జీవులు. అణకువతో మసులుకొంటారు. వృద్ధులపట్ల భక్తిచూపుతారు. పొదుపరులు. చావుకు వెరవని ధైర్యవంతులు. పరిస్థితులకు అమరిపోయే నేర్పరులు.

మన దేశంలోలాగానే అక్కడ జనాభా హెచ్చు. అందుకనే వారు కాలవల పైన పడవలనే ఇండ్లుగా చేసికొని, వాటిపైనే యావజ్జీవితమూ గడుపుతారు.

చీనాభాష చిన్నచిన్న పదాలతో కూర్చబడివుంటుంది. ఒక్కొక్క పదం ఒక్కొక్క భావాన్ని తెలుపుతుంది. కాగితము, ముద్రణయంత్రం, తుపాకిమందు, నావికులకు దిక్సూచియంత్రం— ఇవన్నీ మొట్టమొదట కనిపెట్టింది చీనావారే. అటువంటి చీనాదేశంలో జన్మించినవాడే ఈ నెల మీరు అట్టచివర చూచే ముసలమ్మ ఒడిలో కూర్చొనివున్న చిన్నారి బాలుడు.

ఒంటిగీత బొమ్మ





టైపుచిత్రాలు పంపినవారు:

నెమలిబొమ్మ: హెచ్. ఎస్. రవికుమార్, హాసన్ (మైసూరు)

తాజ్ మహలు: వి. మార్కండేయరావు, విజయనగరం



## గమనిక

క్రిందటినెల చందమామ సంపాదకీయం చదివిన పాఠకులు కృషిచేసి అనేక ప్రాంతాలనుండి చక్కటి టైపు బొమ్మలను ఉత్సాహంతో పంపిస్తున్నారు. ఇది సంతోషించతగిన విషయం. టైపుబొమ్మలను పంపించే చిత్రకారులు రంగుసిరాలు గాక బొమ్మలను నల్లరిబ్బను ఉపయోగించి చిత్రిస్తే, ప్రచురణకు ఎక్కువ అనుకూలంగా వుంటుంది.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1953 సెప్టెంబరునెల సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాట లోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ జూలై 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ ఒకపోస్టుకార్డుపైనవ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## అగస్టు నెల చందమామలో

ప్రచురింపబడే ఫోటోలకుగాను, ఈ దిగువ ఉత్తమవ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

మొదటి ఫోటో: 'ఇంటికి అంద' | రెండవ ఫోటో: 'దేశానికి జెండా'

పంపినవారు: జి. సుబ్బరామమ్మ – బందరు

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపినవారి పేరుతోసహా సెప్టెంబరునెలలో ప్రచురిస్తాము. బహుమతిమొత్తం రూ. 10/- సెప్టెంబరుసంచిక వెలువడిన వెంటనే పంపబడుతుంది.











Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him from Chandamama Publications, Madras 26, Controlling Editor: SRI CHAKRAPANI.

Photo by J. V. Sivarama Sastry



బహుమతి
పొందిన వ్యాఖ్య

'రెస్టు'

పంపినవారు :
బి. పి. విఠల్‌కుమార్ - వాల్తేరు

